









# చరిత్ర

## హిందూ దేశ,ఆంధ్రుల,సాహిత్య,తత్వ

# కలిశక విజ్ఞానం- 1







## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre

Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

**Title Beginning with.**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Author's Last Name**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Year**

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

**Subject**

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

**Language**

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

“దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం” అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన ‘ఇచ్ఛ’ (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. “నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది” అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

7-7-66—10

# కలిశకవిజ్ఞానము

## ప్రథమభాగము

(జ్యోతిస్సిద్ధాంతుల కాలనిర్ణయం)

---


గ్రంథకర్త & ప్రకటనకర్త:

**కోట వెంకటాచలం**

అద్వైతబోధిని, నిర్విచారజీవనం, మానవసృష్టి విజ్ఞానం,
ఆర్యావిజ్ఞానం ఇత్యాది గ్రంథముల గ్రంథకర్త

గాంధినగరం, విజయవాడ.


---


విరోధినామ సం॥ర శ్రావణమాసము
కలి. 5050 క్రీ. శ. 1949 ఆగస్టు నెల

హక్కులన్నియు గ్రంథకర్తవే

[ వెల రు. 1—8—0

# కలిశక విజ్ఞానము

(కలిరాజవంశావళీ)

## ప్రథమ భాగము

### జ్యోతిస్సిద్ధాంతముల కాలనిర్ణయం

## విషయ సూచిక

# ప్రకటన

1. మానవసృష్టి విజ్ఞానం, (ఇంగ్లీషు తర్జుమా) వెల 1-8-0

గ్రంథకర్త:- కోట వెంకటాచలంగారు

గాంధినగరం - విజయవాడ. (2)

ది 14 మే 1949 కృష్ణాపత్రిక యిట్లు వ్రాయుచున్నది—

"విజయవాడ వాస్తవ్యులగు శ్రీ కోట వెంకటచలంగారు అద్వైత బోధినీ, సిద్ధాచారి జీవనము, ఆభాసకైస్తవము, బ్రహ్మాండ సృష్టి విజ్ఞానము, కలిశకవిజ్ఞానము, మానవసృష్టి విజ్ఞానమనెడి ఉత్తమ గ్రంథముల రచించి ఆంధ్రమహాజనులకు అపారమైన సేవ చేసి యున్నారు.

పురుష ప్రకృతిచిద్విలాసము, సృష్టిక్రమము విపులముగ శాస్త్ర ప్రమాణముగ వర్ణించుటయేగాక డార్విన్ సృష్టిక్రమము అసంపూర్తిగ నున్నదని ఋజువు చేయగలిగిరి.

ప్రపంచసృష్టి 195, 58, 85, 050 సం॥ల క్రింద జరిగియున్నదని స్పష్టపరచిరి.

భారతీయులు ఆదిమనివాసులని, వేలకొలది సం॥రములకు క్రితమే నాగరికతకు, విజ్ఞానమునకు పేరు పొందిరని, ఆఫ్రికా, ఆస్ట్రేలియా, అమెరికా ఖండములగూడ ఆక్రమించుకొని నివసించిరని యిపుడివుడే గుర్తింపబడుట సంతోషకరము.

ఆర్యవిజ్ఞానమునకు మూలాధారము వేదములనియు, ఆర్యుల నివాసస్థానము సరస్వతీ నదీతీరమగు బ్రహ్మావర్త దేశమనియు, గ్రంథస్థ నిదర్శనపూర్వకముగ కళ్ళకు కట్టినట్లు స్పష్టీకరింపగలిగి, ప్రాచీనభారతవర్ష చిత్రపటము చక్కగ ముద్రింపించి మన మన్ననలకు పాత్రులైరి.

భారతదేశచరిత్ర పునర్నిర్మాణ యుగమున యిట్టి యుత్తమ గ్రంథములందలి విషయము లెక్కువగా ఆచరణయోగ్యములుగ నుండగలవు."

రాష్ట్రపతి డాక్టరు శ్రీ భోగరాజు పట్టాభిసీతారామయ్య పంతులుగారు న్యూఢిల్లీనుండి యిట్లు వ్రాసియున్నారు—

న్యూఢిల్లీ,
26-7-1949

ఆర్యా!

మీవద్దనుంచి యీరోజు వచ్చిన మానవసృష్టి విజ్ఞానము అనే పుస్తకము అందినది. కొంచెము హెచ్చుతగ్గుగా పుస్తకము సాంతముగా చదివినాను. అద్భుతంగాయున్నది. మీరు నిరాడంబరముగా యింతకృషి చేస్తున్నారన్న విషయము మాకు యిదివరకు తెలియదు ఆంగ్లమునందు తర్జుమా చేయించుట చాలా మంచిపని జరిగినది. అచ్చులోనున్న 11 పుస్తకములలో రెండవస్థానం వహించిన యీ పుస్తకముగాక యింకోపది పుస్తకములు రావలసియున్నవి. అవి అన్నియు ఇంత ముచ్చటగను ఇంత తేజోవంతముగను ఉండునని చెప్పుటకు సందేహము లేదు. మనవైపునుండి ఇంతటి గ్రంథము వెలువడినందులకు మీకు నా కృతజ్ఞత తెలుపుచున్నాను.

చిత్తగించవలెను.

భోగరాజు పట్టాభిసీతారామయ్య (సంతకము)

కె. యస్. రామస్వామిశాస్త్రి గారు రిటైర్డు హైకోర్టుజడ్జి
రాయపేట, మద్రాసు.
19-7-49.

యీ ప్రకారముగా వ్రాయుచున్నారు—

My Dear Sir,

I thank you sincerely for sending me a copy of your excellent book "Manava Srishti Vijnanam". You have given convincing reasons for your views, I feel sure that your book will receive ever increasing public appreciation.

Yours Sincerely
(Sd.) K. S. Ramaswamy Sastri.

శ్రీ ఉయ్యూరు రాజాగారిట్లు వ్రాసియున్నారు—

నూజివీడు

20-7-49

Sir,

తాము పంపిన మానవసృష్టివిజ్ఞానము అనే యిగ్లీషుగ్రంథము అందినది. చాలా పరిశోధన చేసి తమరు నిర్ణయించినటువంటి విషయం యిత్యాది—

The Indian Republic, Monday July, 18th, 1949.

ఇండియన్ రిపబ్లిక్ అను పత్రిక యిట్లు వ్రాయుచున్నది—

ది 18 జులై 1949 సోమవారం

"The Problems raised are of practical value and should be solved with the aid of our own ancient literature and by a proper interpretation. The conclusions are thought provoking and deserve to be widely read and thought over. The need for a re-orientation of the Study of the Indian History is well indicated by the facts brought out in this work."

## 2. ఆభాస క్రైస్తవం  వెల 1-8-0

రచన:- కోట వెంకటాచలంగారు

గాంధినగరం విజయవాడ. (2)

1. ది 29 అక్టోబరు 1948 తెలుగుస్వతంత్ర మద్రాసు వారపత్రిక యిట్లు వ్రాయుచున్నది—

"అభాసక్రైస్తవము" జిజ్ఞాస రేకెత్తించే చురుకైన విమర్శన పుస్తకం. క్రైస్తవమత విషయాలన్నీ లేనివానిని ఉన్నట్లుగా ఊహించిన పని వాని తాత్పర్యం. రెండువేల సం॥రాల పైనుంచి ఈజిప్టులో క్రిష్టియను' మతమనేది వుంది. పుస్తకం యీ విషయాలన్నిటిని ఆ యా గ్రంథాలనుంచి సేకరించిన ప్రమాణవాక్యాలతో సహేతుకంగా వివరిస్తోంది. ఇదే యింగ్లీషులో వెలువడివుంటే ఇంకా యెక్కువ ప్రయోజనము, ప్రచారము ఉండేదేమో అని తోస్తుంది."

2. ది 3-11-48 "విజయవాణి" పత్రిక విజయవాడ యిట్లు వ్రాయుచున్నది—

"ఇదిఒక అపూర్వ ప్రజ్ఞాసమన్విత పరిశోధక గ్రంథం. భారత దేశంలో మన సంస్కృతి విజ్ఞానాలకు భంగం కలిగిస్తూవున్న యీ రోజుల్లో ప్రజలకన్నులను తెరుస్తున్నదీగ్రంథం. ఇది యింగ్లీషులోనికి తర్జుమాచేసి క్రిష్టియన్ పాదరీలందరికి పంచిపెట్టతగిన ఉద్గ్రంథం."

3. ది 25-9-48 "కృష్ణాపత్రిక" యిట్లు వ్రాసియున్నది—

"క్రైస్తవమతస్థులు దీనిని సాకల్యంగా పరిశీలించి సత్యవిచారణ చేసుకోవడంమాత్రం వారికే శ్రేయస్కరమనుటకు సందేహము లేదు. హింసావిధానంచేతను, దానోపాయంచేతను మతవ్యాప్తి సాధించుకొన్న పూర్వవృత్తాంతమును దలచుకొని యిప్పటికైనా సిగ్గుపడి క్రైస్తవమతాచార్యులు సవోల్లేఖనపూర్వకంగా క్రైస్తవమతమును ఒక క్రొత్తదారిత్రొక్కిస్తే వారికీ లోకానికీ గూడా క్షేమకరం అవుతుంది. ఈ గ్రంథంవారిని అట్టి ఉద్యమానికి ప్రేరేపిస్తుందని ఆశిస్తున్నాం." ఇత్యాది—

4. ది 4-12-48 "ఆంధ్రవాణి" విజయవాడ యిట్లువ్రాసియున్నది—

"క్రైస్తవ మతము కల్పితమని ఋజువుచేయు గ్రంథములు ఆంగ్లమునందును, హిందీయందును పెక్కులుగలవు. కాని వాని అన్నిటికంటె యీ ఆంధ్రగ్రంథం యెక్కువ ప్రామాణికముగాగలదని చెప్పక తప్పదు. ప్రతిమతస్థుడూ యీ పుస్తకమును తప్పక చదువవలెను. శ్రీ వెంకటాచలంగారు చేసిన చారిత్రకపరిశోధనకు ఆంధ్రులెల్లరు ఋణపడియున్నారు." ఇత్యాది—

---



గ్రంథకర్త:

( వయస్సు 64 సంవత్సరములు )

# పీఠిక

భారతీయుల వాఙ్మయములో వేదములకుపిమ్మట రామాయణ, మహాభారతము లనెడి ఇతిహాసములు రెండును, పదునెనిమిది పురాణములును అతి ప్రాచీన గ్రంథములని యెంచబడుచున్నవి. అందు శ్రీమద్రామాయణ మతిప్రాచీనగ్రంథము. కవి వాల్మీకి. అది సూర్యవంశ సంభూతుడు శ్రీమహావిష్ణుని యవతారమూర్తియు నైన శ్రీరామచంద్రుని కథను చెప్పును. భారతము చంద్రవంశపు రాజుల చరిత్రను, కురుపాండవయుద్ధమును దెలుపును. శ్రీరామావతార కథ వైవస్వతమన్వంతరములోని యిరువదైదవ మహాయుగము లోనిదని చెప్పబడుచున్నది. అనగా ఇప్పటికి సుమారుగా ఒకకోటి నలుబది ఆరులక్షల సంవత్సరముల క్రిందట జరిగిన కథ. కొందరి అభిప్రాయము ననుసరించి యిరువదెనిమిదవ మహాయుగములోని త్రేతాయుగ మధ్యకాలమని క్షణమాత్ర మంగీకరించినను త్రేత 12,96,000 సంవత్సరములలో సుమారుగా సగం 6,48,000+(ద్వాపర యుగ కాలము) 8,64,000+కలిలో ఇప్పటి (క్రీ॥ శ. 1944 స॥రముకు) జరిగిన కాలము 5044 = (6,48,000 + 8,64,000+5,044)15,17,044 సం॥రముల క్రిందట జరిగిన కథ. రామాయణకథ శ్రీరామచంద్ర మూర్తి రాజ్యము చేయుచుండిన కాలముననే రచించబడి శ్రీరాముని అశ్వమేధయాగ కాలమున ఆయన కుమాళ్ళు లవ, కుశులచే గానము చేయబడినది.

మహాభారతము: భారతయుద్ధమునకుపిమ్మట 36 వ సంవత్సరములో శ్రీకృష్ణభగవాను లవతారము చాలించుటయు, ఆకాలముననే కలియుగ ప్రవేశమగుటయు, ఆ సంవత్సరముననే పాండవులు రాజ్యమును, పరీక్షిన్మహారాజు కప్పగించి దేశాటనమున కేగుటయు జరిగినది. అట్టి కలి ప్రవేశకాలమైన ప్రథమ సంవత్సరముననే శ్రీ వేద వ్యాసులు "జయ" యను పేరున మహాభారతమును అరువదిలక్షల

శ్లోకములుగల గ్రంథముగా వ్రాయుటకు ప్రారంభించి మూడు సంవత్సరములలో పూర్తిచేసినట్లు భారతములో చెప్పబడినది. అందు లక్ష శ్లోకములుగల గ్రంథము మానవలోకమున మనకు దక్కినది. కలి ప్రారంభించి 1944 A. D. కి 5044 సంవత్సరములు. కలి ప్రారంభము లగాయతు కలిశక మొకటి ప్రారంభింపబడి నిత్యము మనచే త్రికాలములయందును స్మరింపబడుచున్నది. ఒక్కొక్క సంవత్సరమునే కలుపుకొనుచు మన పంచాంగములలో యుదహరింపబడుచున్నది. భారతయుద్ధము కలిపూర్వము 36 వ సంవత్సరమున జరిగియున్నది. యుద్ధము ముగిసి యుధిష్ఠిరుని (ధర్మరాజు) పట్టాభిషేకము జరిగిన కాలమునుండి యుధిష్ఠిరశక మొకటి ప్రారంభింపబడినది. ఇప్పటికి యుధిష్ఠిరశకం 5080. "జయ" యను పేరున మహాభారతము వ్రాయుటకు ప్రారంభింపబడిన కాలమునుండి అనగా కలి 1వ సంవత్సరమున జయాభ్యుదయ యుధిష్ఠిరశక మొకటి ప్రారంభింపబడినది. పాండవులు దేశాటనమును ముగించి స్వర్గారోహణ మొనర్చిన కలి 25వ సంవత్సరమునకు పిమ్మట కలి 26 సంవత్సరములో "యుధిష్ఠిర కాలము" అనయు లోక కాలము, సప్తర్షి శకమను పేర్లతో యొక శకము ప్రారంభింపబడినది. (ఆసంవత్సరము సప్తర్షి మండలము మఖానక్షత్రమునుండి పూర్వఫల్గునీ నక్షత్రమందు ప్రవేశించిన కాలమగుటచే సప్తర్షి శకమనికూడను పిలువబడినది.

| | | |
|---|---|---|
| 1. యుధిష్ఠిరశకం | 3138 బి. సి. | 36 కలిపూర్వం |
| 2. కలిశకం | 3102 బి. సి. | 1 కలి |
| 3. జయాభ్యుదయ యుధిష్ఠిరశకం | 3102 బి. సి. | 1 కలి |
| 4. యుధిష్ఠిర కాలము | 3076 బి. సి. | 26 కలి |

పురాణేతిహాసములలోని ప్రతివిషయము యేకాలముననో యే లోకములోననో జరిగియుండనవని భారతీయులు నమ్ముచుండిరి. వాటి నధ్యయనముచేసియు, శ్రవణముచేసియు ఐహికాముష్మికముల

బొందగల యోగ్యతను సంపాదించుకొనుచుండిరి. కొందరన్యమతస్థులు తమ బుద్ధికందినంతవరకు సత్యములు కావచ్చుననియు, మిగత విశేషవిషయములు కవికల్పితములనియు యెంచుచుండిరి. కథలకంటె యెక్కువగా వానిలో చెప్పబడిన ధర్మములు, ఆధ్యాత్మిక విషయములు, సంఘ మర్యాదలు, సాంప్రదాయములు చూచి కొందరాశ్చర్యచకితులై భారతీయుల నాగరికతను వేనోళ్ళ బొగడుచుండిరి.

ఇట్టిస్థితిలో పాశ్చాత్యపండితులు ప్రపంచములోని దేశచరిత్రలను వ్రాయుతలంపున దేశదేశములలోని వాఙ్మయములను పరీక్షింపుచూ తమ బుద్ధిననుసరించి వాటిని విమర్శింపుచుండిరి. అట్లే భారతవర్షములోని భారతీయ వాఙ్మయమును తరచనారంభించిరి. ఏగ్రంథమును జూచినను భారతీయుల ప్రాచీనత యుగములు, మన్వంతరములు, కల్పములును దాటిపోవుచుండెను. ఎన్నివిధముల ప్రయత్నించినను భారతీయ ప్రాచీనతను తగ్గింప వీలుకాకుండెను. వారి మతగ్రంథములో చెప్పబడిన సృష్టికాలము ఆరువేల సం॥ రముల కాలమైయున్నది. అంతకంటే వారిబుద్ధి పైకిపోవ నవకాశము లేకుండెను. అందుచే భారతీయ వాఙ్మయమున గల ప్రాచీనతనుకూడను ఆరువేల సం॥ రములకులోపు కాలములో నిముడ్చి చరిత్రలు వ్రాయ ప్రారంభించిరి. వారు భారతదేశ చరిత్రను వ్రాయుటకు భారతీయుల ఇతిహాస పురాణముల ననుసరింపక తప్పినదికాదు. వారి జాతిచరిత్రనే సమగ్రముగా చెప్పలేని వారి వాఙ్మయము వారికి మూలపురుషులైన భారతీయుల చరిత్రనెట్లు చెప్పగలదు? అందువలన గత్యంతరములేక వారు పురాణేతిహాసములను తీసుకొని అందు చెప్పబడిన ప్రాచీనతను సంబంధించిన కాలములు ఇటీవలి వారిచే కల్పింపబడినవిగాని నిజమైనవి కావని యొక్కమాటలో త్రోసివైచిరి. ప్రాచీనమనగా క్రీ॥ పూర్వము వేయి సం॥ ల లోపనియు నవీనమనగా క్రీ॥ శకప్రారంభమునుండి ఇటీవలి కాలమనియు నిర్ణయించి భారతీయులచరిత్రనంతను బి. సి. ఎ. డి. (B C. A. D.) యనెడినాలుగక్షరములలో నిముడ్చిరి. అందు ముఖ్యముగా A. D. లోనికే దెచ్చుటకే వారి శక్తియుక్తులను

హెచ్చుగా ప్రయోగించిరి.

"It is certainly surprising to find that the net result of all critical labours pertaining to Indian subjects of this kind, for at least the past 100 years, has been more or less the rejection of all important items as useless and irrelevant and the admission of minor ones as essential to form the basis of all arguments urged forward in reviewing such topics."

(Permanent History of BHARATA VARSHA)

*By*

**K. NARAYANA IYAR** B. A.

Superintendent, The Maharja School of Arts

TRIVANDRUM.

తా॥ ఒక శతాబ్దకాలము చేయబడిన విమర్శనా ఫల మంతయు భారతీయ వాఙ్మయమునగల ముఖ్యాంశములను తిరస్కరించి పనికిమాలిన అల్పాంశములను తమ విమర్శనలకు ప్రాతిపదికగా చేసుకొని సారాంశముల నూహించి నిర్ణయించుట కెక్కువగా పనికివచ్చినది.

ప్రకృతిశాస్త్రము, భాషాశాస్త్రాదిగాగల శాస్త్రపరిశోధనల వలన తాము గొప్ప సత్యములను దెలిసికొంటిమని చెప్పుచు వాటి దృష్టిలోనుండి భారతీయ వాఙ్మయమును విమర్శించజొచ్చిరి. వారిచే కనుగొనబడినటుల చెప్పబడిన విషయము లసంపూర్ణ ములు. ఈరోజున చెప్పబడిన సిద్ధాంతము రేపటికపసిద్ధాంత మగు చున్నది. రోజురోజును మారుచుండెడి విషయములను సత్యములని, సిద్ధాంతములని యెంచువారు పిచ్చివారని చెప్పవలసియుండును. (సైన్సు అనగా) ప్రకృతిశాస్త్రము క్రొత్తక్రొత్త పరిశోధనలవలన అభివృద్ధి పొందుచున్నటుల యెంచుచున్నారు. అభివృద్ధి అనగా నిత్యము మారుచుండునదని అర్థము. నిరంతరము మారుచుండెడి శాస్త్రమును స్థిరమైనదిగా నెంచుటెట్లు? దానిని ప్రయోగించి ఇతర విషయములలోని సత్యాసత్యముల గ్రహించుటెట్లు? మనమొక

భూమినిగాని, గుడ్డనుగాని కొలిచి అది యెంత విస్తీర్ణముగలదో నిర్ణయించుటకు నిలకడయై స్థిరమైన కొలబద్ద నొకదానిని కల్పించుకొనవలయును గదా! అట్లుగాక మనమిప్పుడు గజముగా నెంచుకొనిన బద్దతో కొంతదూరమును, అంతకంటె నెక్కువగాగల బద్దతో కొంత దూరమును దానికంటె చిన్నదైన యింకొకబద్దతో కొంతదూరమును కొలుచుకొనిన సరియైన విస్తీర్ణమును నిర్ణయించగలుగుదుమా? కొలతప్రమాణము నిలకడగా నుండనక్కరలేదా? వారిచే కనుగొనబడిన ప్రకృతి శాస్త్రాదులు నిలకడలేనివై నిరంతరము మార్పును జెందుచు వృద్ధినో క్షయమునో పొందెడివై యుండగా అట్టి యసంపూర్ణ శాస్త్రవిషయములను బరిగ్రహించి అనాదిగా నుండినట్టియు సంపూర్ణములై స్థిరమైనట్టియు భారతీయుల శాస్త్రసిద్ధాంతములను విమర్శించు టేటి న్యాయమో విచారింపుడు.

ఇప్పుడు ప్రపంచములో కెల్ల గొప్ప ప్రకృతిశాస్త్రవేత్తలుగా పరిగణింప బడుచుండిన మహాపురుషులు తనుచే కనుగొనబడినట్లూహింపబడుచుండిన ప్రకృతి శాస్త్రవిషయములను (Scientific-experiments) గురించి చెప్పిన వాక్యములను చూడుడు.

Professor Jeans James, the great Astronomer admits in his book called "Mysterious Universe" that:-

"Every conclusion is quite frankly speculative and uncertain. We are not in contact— with ultimate reality."

తా॥ "జీన్సు జేమ్సు" అను ఖగోళ శాస్త్రపండితుడు తనచే వ్రాయబడిన "అగోచర జగత్తు" అను గ్రంథమున యీ విధముగా వ్రాసి యున్నాడు.

"(మాచే కనుగొనబడినట్లు యెంచబడిన) ప్రతినిశ్చయము నిష్కపటముగా (చెప్పిన) నమ్మరానిది. అనిశ్చయమైనది. (అనగా నమ్ముటకు వీలులేనిది అని అర్థము.) సంపూర్ణముగా సత్యమని చెప్పదగిన విషయము మా కందియుండ లేదు."

Professor Haldane in his "Possible worlds" writes "Every statement of a modern Physicist is false. Many of our most cherished Scientific theories contain so much falsehood as to deserve the title of myths."

తా॥ ఆధునిక ప్రకృతి శాస్త్రజ్ఞుని (వలన చెప్పబడుచుండిన) ప్రతి సిద్ధాంతము అసత్యమై యున్నది. మావల్ల వృద్ధి పొందింపబడు చుండిన ప్రకృతిశాస్త్ర సిద్ధాంతములలో కల్పిత గాథలని చెప్పబడుటకు తగిన అనృతము లనేకములుండియున్నవి.

"Prof. planck" writes in his book "Where is Science going"

"Science cannot solve the ultimate mystery of Nature, and that is because, in the last analysis we ourselves are part of Nature and therefore part of the mystery we are trying to solve" (Page 217.)

తా॥ ప్రకృతిశాస్త్రము ప్రకృతియొక్క అంతమును సాధించ లేదు. ఎందువలన ననగా పదార్థముయొక్క కడపటి విభాగము (లేక పృథఃకరణము) లోనూ అట్లు విభాగమును చేయుచుండిన మనము కూడా (అనగా అహంకారముకూడా) యొక భాగముగా నుండినందు వలన మనము సాధింప నుద్దేశించిన ప్రకృతి రహస్యము నొక భాగముగా నైతిమి. (అనగా ఆత్మవస్తువు నెఱుగని మనము ప్రకృతి పృథఃకరణమును చేయజాలకుంటిమని భావము.)

ఈవిధముగా ప్రకృతి శాస్త్రజ్ఞులలో ప్రముఖులైనవారలు చెప్పుచుండగా ప్రకృతి స్వరూపమును గాని, ప్రకృతిశాస్త్రజ్ఞానమును గాని నెఱుగక పైపండితుల వాక్యములలోని పూర్వపక్ష వాక్యములు సిద్ధాంతములుగా భ్రమించి అట్టి సిద్ధాంతములనబడుచుండిన అనృత వాక్యములతో సమన్వయముచే వీలుకాని సత్యమై, నిత్యమైన భారతీయ శాస్త్రసిద్ధాంతములను ప్రస్తుత ప్రకృతిశాస్త్రమునకు సమన్వయింప జూచుట వారి శాస్త్రజ్ఞానహీనతకు నిదర్శనమని తెలియవలెను.

అట్టి నిస్సారమైన విమర్శనలతోగూడి పాశ్చాత్య పండితులు భారతీయ వాఙ్మయమును గలచి కలుషితమొనర్చి భారతీయులకు వానియందుండెడి విశ్వాసమును చెడగొట్టిరి. భారతీయులీదేశజులు కారనిరి. ఎచ్చటనుండియో బయటదేశములనుండి యీదేశమునకు వచ్చిరని నిర్ణయించిరి. వేదములు యీదేశమున కార్యులు వచ్చిన పిమ్మట వ్రాయబడినవనిరి. అవి యప్పుడప్పుడు పశులకాపరులుగానుండినవారు పాడుకొనిన పాటలనిరి. రామాయణాది యితిహాస పురాణాదులు యిటీవలికాలమున అనగా (A. D. లో) వారి క్రీస్తు పుట్టినట్లు కల్పింపబడిన తరువాతికాలమున వ్రాయబడినవనిరి. అవన్నియు చరిత్రాభాసములనియు, వానికి చారిత్రక విలువ కట్టుటకు వీలులేదనియు సిద్ధాంతీకరించిరి. భారతము వ్రాసినపిమ్మట రామాయణము వ్రాయబడినదనిరి. రామాయణకథ హిందూస్థానమునచేయబడుచున్న వసాయ చరిత్రయనిరి. ఈవిధముగా తెలిసియు తెలియని తమ సిద్ధాంతాభాసములను చరిత్రలను పేరున గ్రంథములను వ్రాసి మన బిడ్డలకు బడిలో పాఠ్యగ్రంథములుగా పెట్టి చదివించి యీ విపరీతాభిప్రాయములను వారి బుద్ధులలో కెక్కించిరి. ఈవిధముగా ఒక శతాబ్దము చేయబడిన వారి కృషివలన తమను, తమ పూర్వులను తమ వాఙ్మయమును నిరసించుచూ పాశ్చాత్య పండితుల యడుగు జాడలలోనడచుచు వారిచే కల్పింపబడిన కృత్రిమాభిప్రాయములను సత్యములని నమ్మి ప్రవర్తించెడు హైందవ జాతియొకటి దేశములో నేర్పడినది. ఈ మహాము హులు వారుచెడినదేగాక నాశివయములను దేశభాషలలో కెక్కించి పాశ్చాత్య విద్యనుగాని, ఆపండితుల యభిప్రాయములను గాని నెఱుగని సామాన్యజనులనుగూడ చెఱుపుచుండిరి. పురాణములను నిరసించుచు ఒక క్రైస్తవ మతగురువు "రివరెండు బెనర్జి" అనునాతడు వ్రాసిన మాటలను చూడుడు.

"The Puranas in general contain no authentic history there is no plot, no finish, no humour no wit, no poetry, but mere versification and combination of irrelevent and incoherent facts"

Monier Williams says that:-

"The complete list of 18 Puranas given in all the puranas is absurd and must therefore be latter interpolations."

తా॥ పురాణములలో సరియైన చరిత్ర లేదు. ఎత్తుగడ సరియైనది కాదు. సంపూర్ణత గానరాదు. రసము శూన్యము, చాతుర్యము కనుపడదు. కవిత్వము లేదు. పనికిరానట్టియు, సంబంధము లేనట్టియు వాక్యముల కూర్పు మాత్రమే యైయున్నది.

మోనియరు విల్లియమ్సు అనునాయన వ్రాసిన వాక్యములు:—

పదునెనిమిది పురాణములుగలవని పురాణము లన్నిటిలోను నీయబడిన పురాణముల నామములుగల జాబితా కేవలమబద్ధము (లేక యసంగతము) అది యిటీవల పురాణములలో క్రొత్తగా కల్పించి చేర్చబడినదై యున్నది.

ఈ ప్రకారము పాశ్చాత్యవిద్వాంసులందరును మన పురాణాది వాఙ్మయమును నిరసించుచు గ్రంథములను వ్రాసియుండిరి. ఆ మాటలనే చదివి మనవారలు తమ వాఙ్మయమును తామే నిరసించుకొనుచుండిరి,

భారతజాతియొక్క పుట్టుక, అభివృద్ధి, వ్యాప్తి, మతము, ఆచారములు యోగ్యత, నాగరికత, మొదలుగా యితర జాతులకు లేని ప్రత్యేకతను దెలిపెడి యీపౌరాణిక వాఙ్మయమును త్రోసివేసిన యెడల యీ జాతియొక్క ప్రాచీనౌన్నత్యమును దెలుపగల సాధన సంపత్తికేమిగలదు, భారతీయులకనాదిగా వచ్చుచుండిన వేదవాఙ్మయము నొదిలిన ప్రపంచజాతులలో నీ జాతికీయగల స్థానమెద్ది? దీనిని విచారించకనే నాగరికతయను పేరున భారతీయ నాగరికతకు, మత, నీతులకు తక్కువ స్థానమందించిన పాశ్చాత్యనాగరికతాభాసము నవలంబించిన యెడల యీ జాతియొక్క గతి యెట్లుండునో మన పాశ్చాత్యవిద్యాధికు లాలోచించినవారలు కారైరి. ఆధునిక భార

తీయ విద్యాధికులు తమ వాఙ్మయమును తమ సాంప్రదాయసిద్ధముగా చదువక పాశ్చాత్య పండితులచే వారి భాషలోనికి భాషాంతరీకరణము చేయబడిన గ్రంథములను హూణభాషలో చదివి పాశ్చాత్య సాంప్రదాయముల నవలంబించి తమ వాఙ్మయమును తామే నిరసించుకొనుచుండిరి. వేదశాస్త్రాది వాఙ్మయము నామూలాగ్రముగా చదివి యర్థము చేసుకొనకనే అవి వ్రాయబడిన తేదీలు, వ్రాసిన కర్తలు మొదలయిన అనవసర విచారణనుపెంచి అసలుగ్రంథములోని విషయానుభవము చేయకుండిరి. వారు చేయదలచిన సిద్ధాంతముల కడ్డువచ్చెడి విషయములన్నియు ప్రక్షిప్తములని (పిమ్మట యెవరిచేతనో చేర్చబడినవని) చెప్పిరి. కాని అట్లు ఋజువు చేయగల సాధనము లేవియు వారికి లేకపోయినను యీ మార్గమే వారికి సుకరముగా నుండెను ఇది యెట్టి పిరికిపనియని వారికి దోచదాయెను. ఈ విధముగా ప్రక్షిప్తములని తమచే యెంచబడిన విషయములను త్రోసివేసి తమచే సత్యములని నమ్మబడిన విషయముల సేకరించెడి యుద్యమములలో అనవసర స్వార్థప్రసంగములతో చదువువారికి విసుగుపుట్టించునటుల గ్రంథములు పెంచ వ్రాయబడినందున భారతీయ వాఙ్మయమున గల పారమార్థిక చింత ప్రజలలో తగ్గుటకు హేతువైనది. ఈ విధముగా పాశ్చాత్య పండితులు గడచిన యొక శతాబ్దకాలము యెడతెగని కృషిచేసి భారతీయులను ఇహపరదూరులనుగా నొనర్చి తమ ననుసరించునట్లు చేసిరి. భారతీయులకంటె తామధికుల మనిపించుకొనెడి కృత్రిమప్రయత్నమున నిమగ్నులై తమ యూహాగానములతో చరిత్రలను పేరున గ్రంథములను ప్రకటించిరి. వారిమార్గము ననుసరించి భారతీయ హూణవిద్యాధికులును చిలుకపలుకులు పలుకుచు వారి యూహలకు ప్రాముఖ్యమిచ్చుచు గ్రంథాభాసములనల్లుచు గురువులకు సమర్పించుచుండిరి.

వేద, శాస్త్ర, పురాణేతిహాసాది భారతీయ వాఙ్మయమంతయు, మానవసృష్టి మొదట భారతవర్షమున "సరస్వతీ నదీతీరమున" నైనదనియు, అచ్చట వృద్ధిపొందినపిమ్మట సరస్వతీనదికి తూర్పు, దక్షి

ణము, ఉత్తరములకును అటుపిమ్మట సరస్వతీనదినుండి పశ్చిమమున కాబూలు నదివరకును విస్తరించినటుల స్పష్టమైన వాక్యములలో నూటిగా చెప్పుచున్నది. మధ్యాసియా, మధ్యఐరోపా ఉత్తరధ్రువ ప్రదేశములనుండిగాని లేక మరి యెచ్చటనుండిగాని పశ్చిమమునుండి తూర్పునకు ఆర్యులు వచ్చినటు లెచ్చటను చెప్పబడియుండలేదు. వేదాది గ్రంథములయందు భారతవర్షములోని పర్వతములు, నదులు, భారతులను పేరుతో భారత ప్రజలు, భారతం, భారతపుత్రులు మొదలుగాగల ప్రయోగములలో భారతవర్షమును గురించిన ప్రసంగములు వినబడుచుండినవి గాని భారతవర్షముకంటె యితర ప్రదేశము లేవియు ఋగ్వేదాదులయం దెచ్చటను వర్ణింపబడి యుండలేదు. భారతవర్షములో వేదధర్మములను త్యజించి ఉపనయనాదుల విడనాడిన వారలు పతితులుగా నెంచబడి "దస్యు" "వ్రాత్య" "మ్లేచ్ఛ" శబ్దములతో పిలువబడు సంఘబహిష్కారులుగా చేయబడిన వారలు వైదికధర్మావలంబకులతో తగవులాడి, వారిని హింసించి వారితో యుద్ధములకు సిద్ధమైనందున యోడింపబడి దేశమునుండి తరిమివేయబడిరి. అట్టివారలు దేశమును వీడి పాశ్చాత్యదేశముల నాశ్రయించిరి. పిమ్మట వారి ననుసరించి వారిమీద రాజ్యము చేయు సంకల్పముతో క్షత్రియు లనేకులు యితర దేశములకు పోయిరి. వ్యాపారము, వ్యవసాయము, శిల్పాదికళలు, విద్యావ్యాప్తి మత వ్యాప్తి చేయుతలంపుతో యితర కులములలోనివా రనేకు లాదేశములకుబోయి స్థిరపడిరి, కాని వీరందరు వైదికధర్మభ్రష్టులై ఉపనయనాది కర్మల త్యజించిన దస్యులతో సంబంధములుకలిగి మ్లేచ్ఛ దేశములలో నివసించుచు వైదికకర్మల చేయించెడి బ్రాహ్మణులచెంతకు పోనందున వారందరు ఉపనయనాది కర్మలులేక "దస్యు" లైనట్లు మనువు స్పష్టమైన వాక్యములలో వ్రాసియున్నాడు (మనుస్మృతి-౧౦ అధ్యాయము చూడుడు) పారదము, పహ్లవము, (పర్షియా), యవనము, (గ్రీసు,) చీనా, కంబోడియా, బాహ్లీకము, బర్బరము (ఉత్తరాఫ్రికా) కాంభోజము మొదలుగాగల పండ్రెండు దేశములలో నివసించెడి క్షత్రియాదులు దస్యులైనటుల మనువు స్పష్టముచేసియున్నాడు.

మానవజాతికి "ఆర్యులు" అను నామమును వేదమే ప్రసాదించినది. ఆర్యులనగా "ఆర్యాః = ఈశ్వరపుత్రాః" అని యాస్కాచార్యుని నిరుక్తమందును సాయనాచార్యుని వేదభాష్యమునందును అర్థము చేయబడినది. అట్లు "ఆర్యులు" చాతుర్వర్ణ్యములుగా సృష్టిలోనికి రాబడినట్లు ఋగ్వేదము స్పష్టము చేసియున్నది ఋగ్వేదములో వర్ణ విభేదము లేదను వాదము కుస్మృతి వాదము. ఋగ్వేదములో చాతుర్వర్ణ్య ముల దెలుపు మంత్రము లనేకస్థలములలో వినబడుచున్నవి. అట్టి మంత్రములను నాచే వ్రాయబడిన మానవసృష్టి విజ్ఞాన మహా గ్రంథమున చూడగలరు. కాలానుసారముగా యిప్పుడు మార్పులో వలసియున్నదని నమ్మెడు వారలు వారియిష్టానుసార మాచరించెదరు గాక! వేదధర్మానుయాయులు "ఆర్యులు" వేదధర్మమును త్యజించిన వారలు "దస్యులు" అని వేదమే నిర్ణయించినది. వేదధర్మ మును త్యజించి దస్యులై దేశాంతరగతులై వైదిక విద్యాలేమం దున నాగరికతాహీనులై, యిప్పటివరకు ముఖ్యపశ్చిమఖండ ప్రదేశా నాదుల నెఱుగక యెట్లో జీవయాత్ర నడుపుచుండినవారలు మనకెట్టి నాగరికత నీయగలరు? వారిననుసరించి అసాంప్రదాయభావము లను పొందుటకంటె తమ వేదశాస్త్ర వాఙ్మయమును తరచి తమ పూర్వనాగరికతను పొంది మహర్షుల మార్గము ననుసరించుట మేలు. స్వాతంత్ర్యమును పొందిన భారతీయులకు ప్రథమకర్తవ్యమదియే. ఇట్టి భావదాస్యమెంత త్వరలో విడువబడిన అంత త్వరలో భారతీయులు సర్వస్వతంత్రులగుదురు.

కొందరు పాశ్చాత్య పండితులు వైదిక వాఙ్మయము నెంతనిర సించినను రానురాను బుద్ధిమంతుల నేకులు బయలుదేరి సత్యమును గ్రహించి భారతీయ వాఙ్మయము ప్రపంచములో నుత్తమస్థానమలం కరించియున్నదని వేనోళ్ళ బొగడియుండిరి. భారతదేశమునకు గొప్ప తనమును ప్రతిష్ఠను, యిదివరకు దెచ్చినది, యిప్పుడు దెచ్చుచున్నది, ముందు తేగలది వేదవాఙ్మయమె. అట్టివేదము గురువువలన విని స్వర ముల సరిగా నుచ్చరించగల మానవులచేతనే నిలువగల్గినది గాని గ్రం

ధములుగా నచ్చువేయించి దాచుకొనిన గ్రీకు చరిత్రకారులచే రెండు వేల సం॥రముల క్రిందట వ్రాయబడిన చరిత్రలును యిటీవల మెగస్తనీసు, హ్యూన్ త్స్యాంగు మొదలుగా గలవారలచే వ్రాయబడిన చరిత్రల కెట్టిగతి పట్టినదో అట్టి గతియే వేదమునకును పట్టియుండెడిది. వేదమును కాపాడుటకు సర్వశ్రేష్ఠమైన గ్రంథాదుల నాశ్రయింపక భారతీయులు తమ జాతియందొక భాగమున కప్పగించి వారిని కాపాడుకొనుచున్నందుననే ప్రపంచములో నెన్నిక గనిన గ్రంథరాజము లెన్నియో అనాగరిక మోటుజాతివారల వలన గ్రంథభాండారములు తగులబెట్టబడి నశించి పోయినను, నెల్లప్పుడును వల్లెవేయుచు నొక పొల్లయినను పోకుండ, సస్వరముగా నుచ్చరించు సజీవగ్రంథములైన బ్రాహ్మణ సంఘీయుల వలన దుష్కాలములలో సైతము నశింపబడక కాపాడబడి నేటికి మనకందీయబడినది. అట్టి సంఘమును కాపాడక యుపేక్షించి వేదమంత్రములను గ్రంథస్థముచేయ ప్రయత్నించుట వలన వేదవిద్య నంతరింపజేసెడి కార్యమునకు పునాదులను వేసిన వారమగుచుంటిమని గ్రహించలేనందుకు విచారించుచున్నాము. ప్రపంచములోగల యన్ని దేశములలోని విద్యాధికులు బుద్ధిమంతులందరకు గౌరవభాజనమై మానవజాతి చరిత్రను యున్నదున్నట్లు చెప్పుటయేగాక మానవాభ్యుదయ మార్గములను, ముక్తిమార్గమును బోధించెడి వైదిక వాఙ్మయ మన్నివిధముల కాపాడదగినది. గ్రంథస్థము చేసినంతమాత్రమున అది కాపాడబడనేరదు. కాలము గడువగా అనేక పొరపాటభిప్రాయములకు హేతువగును. గురుశిష్య పరంపరగా అధ్యయనము చేయబడుచు "వచ్చేవరకు చెప్పుకొనుట, చచ్చేవరకు వల్లించుట" వలననే వేదము ఆచంద్ర తారార్కము నిలువగలదు. గాన ప్రజలును, ప్రభుత్వమును వేదాధ్యయనము చేయువారలను ప్రోత్సహించి వారి కుటుంబములకు తగినవసతులను కల్పించి సృష్ట్యాదినుండి నేటివరకు కాపాడబడిన వేదశాస్త్రాదులను తమ సంతాన క్షేమమునకును, లోకక్షేమమునకును గాపాడుకొందురుగాక.

విజయవాడ.
ది 1-5-49.

గ్రంథకర్త.

ఓమ్

ఆర్యవిజ్ఞానము 3

ఆర్యావర్తః పుణ్యభూమిః

# కలిశక విజ్ఞానము

లేక

## (కలిరాజ వంశావళి)

యుధిష్ఠిరశకపూర్వం 1800 లు॥ యు॥ శ 5085 వరకు
కలిపూర్వం 1836 లు॥ కలి 5049 వరకు
(క్రీ॥ పూ॥ 4938 లు॥ క్రీ॥ శ॥ 1947 వరకు)

## ప్రథమ భాగము

## శకములు

శ్లో॥ చైత్రేమాసి జగత్ బ్రహ్మా ససర్జప్రథమేహని।
శుక్లపక్షే సమగ్రంతు తదా సూర్యోదయేసతి।
వత్సరాదౌ వసంతాదౌ రవిరాజ్యే తథైవచ॥
(నారద పురాణం.)

తా॥ సంవత్సరాదిన, వసంతఋతువు ప్రారంభకాలమున, చైత్రమాస, శుక్లపక్ష, పాడ్యమిరోజున సూర్యోదయ మాచుండిన కాలమున, సూర్యుడు దినరాజునకుడైయుండిన (ఆదివారము)నాడు బ్రహ్మదేవుడీజగత్తును బహిర్గతము నొనర్చెను (అనగా సృజించెను అని అర్థము.)

సృష్టిప్రారంభసమయము } 195,58,85,044 సం॥గముల క్రిందట
కలి 5044 సం॥రంతు } ప్రమాధినామ సం॥ర చైత్రశుద్ధ పాడ్యమిరోజు ఉదయం 6 గంటలకు గ్రహములు లేదును అశ్వనీ ప్రథమకళయందు మేషరాశిలో జేరుసమయము.

ప్రజాపతియైన బ్రహ్మ తనయేబదియొకటవ సం॥రము మొదటి రోజున ఉషఃకాలమందు నిదురనుండి లేచి నేత్రములు తెరచిన "బ్రహ్మముహూర్తము లగాయతు అనగా బ్రహ్మజీవితచరిత్ర ప్రారంభమైన ప్రమాధినామ సం॥ర చైత్రశుద్ధ పాడ్యమి ఆదివారమునాటి బ్రహ్మముహూర్తము మొదలు నేటివరకు అనగా యీగ్రంథ ప్రారంభకాలమైన శ్రీ సుభాను నామ సం॥ర మాఘశు॥ సప్తమి మంగళవారం కలిశకం 5044 (క్రీ.శ. 1 2-1944 సం॥) వరకు 197, 29, 49, 044 సం॥రములు గడచినవి. ఇందులో బ్రహ్మధ్యాన కాలము 1,70,64,000 సం॥రములు పోగా సృష్టి ప్రారంభమైన నాటినుండి 195,58,85,044 సం॥రములు (నూట తొంబదియైదుకోట్ల యేబది యెనిమిది లక్షల యెనుబది యైదువేల నలుబదినాలుగు సం॥రములు.) సృష్ట్యాది సుముహూర్తము శన్యాది సప్తగ్రహములు రేవతిని దాటి అశ్వినిలో ప్రవేశించు సమయము. అనగా చాంద్రమానము ప్రకారము ప్రమాధి సం॥ర చైత్రశుద్ధ పాడ్యమి ఆదివారం సౌరమానము ప్రకారము గ్రహములు మీనరాశిని వదలి మేషరాశిని జేరుసమయం ఈ రెండు మానముల ప్రకారము కూడను చైత్రమాసము (మేషమాసము) శుద్ధపాడ్యమి ఆదివారం యేకమగును. ఈవిషయమును భారత వర్షములోని ఖగోళ శాస్త్రములన్నియు యేకీభవించుచున్నవి.

"బ్రహ్మణా ప్రవహ వాయునక్షత్రాధిష్ఠితో మూర్తో గోళః స్థాపితః తదంతర్గత స్వస్వాకాశగోళస్థ శన్యాదయో నక్షత్రాధిష్ఠిత మూర్తగోళస్థ క్రాంతివృత్తస్థ రేవతి యోగతారాసన్నరూప మేషాది ప్రవేశ సమసూత్రే స్థాపితా"

"సృష్ట్యాదౌ బ్రహ్మణా క్రాంతివృత్తి రేవతి యోగతారాసన్న ప్రదేశే సర్వగ్రహాణాం నివేశి కృత్వా తత్తదనధితో గ్రహచలనాత్ సృష్ట్యాదౌ అర్కవార సంభవాత్, తదహ్న, దినమాన వర్షేశ్వరః"

బ్రహ్మ ధ్యానమును చాలించి కనులు తెరచి సృష్టి ప్రారంభించిన సుముహూర్తము చైత్ర శుద్ధ పాడ్యమి ఆదివారము" దీనిని భారత వర్షములోని సాంప్రదాయములన్నియు పరము పవిత్రముగా నెంచి

పరంపరా గా పాడుకొనుచుండిరి ఆదినమున శని, గురువు, అంగారకుడు సూర్యుడు, శుక్రుడు, బుధుడు, చంద్రుడు యీ సప్తగ్రహములు మేష రాశియందుంచబడుదురు. ఈ లెక్క నెవరును మరచుటకుగాని, మార్చుటకుగాని సావకాశములేదు. ఆకాశములోని యిట్టి గ్రహ చలనాదులమీద నాధారపరచబడి మనసృష్టికాలము లెఖచూడబడు చున్నది. ఈ మాసమునే ప్రాచీన పాశ్చాత్య పంచాంగములలో "మార్చి" అను పేరిడి సంవత్సర ప్రారంభమాసముగా నెంచబడినది. "మార్చి" అనగా గ్రహములు నడచుటకు ప్రారంభించిన మాసమని అర్ధము. చైత్రశుద్ధ పాడ్యమి మార్చి నెలలో వచ్చుటప్పుడప్పుడు జరుగుచునేయుండును. క్రైస్తవ పాదరులు తారుమారుచేసి పాడుచేయు వరకు పాశ్చాత్య పంచాంగములలో "మార్చి" నెల సంవత్సరమునకు మొదటినెలగా యుంచబడుచుండెడిది, దానననుసరించియే ఏడవనెల (సెప్టెంబరు) ఎనిమిదవనెల (అక్టోబరు) తొమ్మిదవనెల (నవంబరు) పదవనెల (డిశంబరు) మొదలుగా పేర్లతో వాడబడుచున్నవి.

భారతవర్షచరిత్ర అనగా సృష్టిప్రారంభింపబడిన 195;58,85,044 సం॥రముల క్రిందట ప్రభవనామ సం॥ చైత్ర శుద్ధ పాడ్యమి ఆదివారం లగాయతు నేటివరకు జరిగినచరిత్రయని అర్ధము. భారతవర్షమునకు దక్షిణముగా నిరక్షరేఖమీదనుండిన లంకాద్వీపాధిపతియైన "మయుడు" కృతయుగము 1200సం॥రములు (పండ్రెండువందలసం॥రములు) మిగిలియుండిన కాలములో సృష్టికాలమును లెఖవేసి ఈవిధముగా నిర్ణయించియున్నాడు.

"కల్పాదస్మాచ్చ మనవః షట్ వ్యతీతాస్ససంధ్యయః।
వైవస్వతస్యచ మనోర్యుగానాం త్రిఘనోగతః॥
(సూర్య. సి. ౧అ. ౨౨శ్లో)

అష్టావింశాద్యుగా దస్మాద్యాతమేతత్ కృతంయుగం"॥
(సూర్యసిద్ధాంతం. ౧అధ్యా ౨౩ శ్లో)

"షట్మనూనాంతు సంపిండ్య, కాలంతత్సంధి భిస్సహ।

కల్పాదిసంధి నాసార్థం వైవస్వత మనోస్తథా''॥ (౭౫ శ్లో)
''యుగానాంత్రితి ఘనంయాతం తథాకృత యుగంత్విదం।
ప్రోక్త్యస్రష్టేః తతః కాలం పూర్వోక్తం దివ్యసంఖ్యయా॥
(౭౬ శ్లో॥)
సూర్యాబ్దసంఖ్య యాజ్ఞేయాకృత స్యాంతేగతాఅమీ।
ఖచతుష్క యమాద్యగ్ని శరంధ్ర శాకరాః॥''
(సూ. సి. ౧ అధ్యా. ౭౭ శ్లో॥)

తా॥ కల్పాదిసంధియు, ఆరుగురు మనువులును, ఆరు మనుసంధులును గడచినపిమ్మట ఏడవమనువులగాయుతు యిరువది ఎనిమిదవ మహాయుగము లోని త్రేతాయుగ ప్రారంభ కాలమునకు 195,37,20.000 సం॥రములు. ఈకాలమునకు సరిగానుండిన గ్రహకూడికనుగూడను నిచ్చియున్నారు.

''అస్మిన్కృతయుగ స్యాంతే సర్వే మధ్యగతాగ్రహాః।
వినాతు పాతమందోచ్చాన్ మేషాదౌ తుల్యతాముతాః॥
(౫౭)
మకరాదౌ శశాంకోచ్చం తత్పాతస్తు తులాదిగః।
నిరంశత్వం గతాశ్చాన్యే నోక్తాస్తే మందచారిణః॥.
సూ. సి. ౧. ౫౭. ౫౮)

మందోచ్చ పాతములు మినహాగా గ్రహములన్నియు మేష రాశియందున్నవి. ఇప్పటివరకు భారతవర్షములోని ఖగోళశాస్త్రజ్ఞులందరును ''మయుని'' సిద్ధాంతము సంగీకరించియుండిరి. సృష్ట్యాది యందును, త్రేతాయుగ ప్రారంభదినమందును చాంద్రసౌరమానములు మేషములో ప్రారంభమగుచున్నవి. అటులనే ప్రస్తుత కలియుగ ప్రారంభ కాలమునకూడను చాంద్ర సౌరమానములు మేషములో ప్రారంభమైనవి. తేలికగా మనము యిప్పటి చారిత్రక కాలములను లెక్కించుకొనుటకు కలి ప్రారంభమును స్థిరపర్చుకొందుము. త్రేతా యుగ ప్రారంభమునుండి కలియుగ ప్రారంభమునకు జరిగిన కాలము

21,60,000 సం॥రములు. కలియుగ ప్రారంభమున సూర్యుడు, చంద్రుడు మేషములో ప్రవేశించిరి. గురు, శుక్రులు లోగడనే ప్రవేశించియుండిరి. కలిప్రారంభమును నిర్ణయించుటలో అభిప్రాయ భేదములు లేక సిద్ధాంతు లందరును నంగీకరించినదైయున్నది. ఇప్పటికి అనగా క్రీ॥ శ. 1944 సం॥కు కలిలో జరిగిన కాలము **5044** సం॥రములు

సూర్యసిద్ధాంతములో మయునివలన నీయబడిన లెఖ —

| | |
|---|---|
| సృష్ట్యాదినుండి త్రేతాయుగాదివరకు (కృతయుగాంతము వరకు లెఖ చూడబడినది.) | 195, 37, 20, 000 |
| త్రేతాయుగాది లగాయతు కలిప్రారంభముకు— | 21, 60. 000 |
| కలి ప్రారంభము లగాయతు యిప్పటివరకు అనగా సుభాను సం॥(క్రీ. శ. 1944సం.) — | 5,044 |
| సృష్ట్యాదినుండి యిప్పటికి వెరసి— | 195, 58, 85, 044 |

నూట తొంబది యైదుకోట్ల యేబది యెనిమిదిలక్షల యెనుబది అయిదు వేల నలుబదినాలుగు సంవత్సరములు—

| | |
|---|---|
| ప్రస్తుతకల్పాదినుండి బ్రహ్మకు గడచిన కాలము— | 197,29,49,044 సం॥ |
| బ్రహ్మ ధ్యానములో గడపిన కాలము— | 1,70,64,000 |
| మినహా యించగా సృష్టి ప్రారంభ కాలము— | 195,58,85,044 |

| భారతీయశకములు | కలిపూర్వము | నవీనుల లెఖ ప్రకారం క్రీ॥ పూర్వము |
|---|---|---|
| ౧. సృష్ట్యాది ము | 195,58,80,00 | 195,58,83,100 |
| ౨. వైవస్వత మన్వాదిశకము | 12,05.28,000 | 12,05,31,100 |
| 3. ఇరువదెనిమిదవ మహాయుగాది శకము | 38,88,000 | 38,91,100 |
| ౪. మయప్రచారిత సూర్యసిద్ధాంత కాలము | 21,61,200 | 21,64,300 |
| ౫. యుధిష్ఠిరశకము (ధర్మరాజుపట్టాభిషేక సమయమునుండి యేర్పడిన శకము) | 36 | 3,138 |

| | | |
|---|---|---|
| ౬. జయాభ్యుదయయుధిష్ఠిరశకము(జయ యనుపేరుగల మహాభారతగ్రంథరచన ప్రారంభింపబడిన సంవత్సరముననె ఈ శకము ప్రారంభింపబడినది. | కలిశకం1సం॥ | 3,102 |
| ౭. కలిశకము. శ్రీకృష్ణనిర్యాణముజరిగిన రోజుననె ఈశకముప్రవర్తించినది 6,7 నెం॥ శకములు రెండును యొకసంవత్సరముననె ప్రారంభింపబడినవి. | కలిశ. 1 సం॥ | 3,102 |
| ౮. సప్తర్షికాలము లేక యుధిష్ఠిరకాలము లేక లౌకికకాలము అని యిది పిలువబడుచున్నది. ఇదిధర్మరాజుని స్వర్గారోహణ మొనర్చిన కలి 25 సం॥ముల పిమ్మట కలి 26సం॥రమున లౌకికులచే ప్రారంభింపబడినది లౌకికాబ్దము అనికూడదీనికి పేరు, యుధిష్ఠిరుని జ్ఞాపకార్థము ప్రారంభమైనది. | కలిశ, 26 సం॥ | 3,076 |
| ౯. సైరసు దిగ్రేటు (Cyrus the Great) అను పారశీకరాజు చే స్థాపింపబడిన శకము. దీనిని శక కాలము, శకేంద్ర కాలము, శక నృప కాలము, శక భూపకాలము. అను పేర్లతో మన భారతీయులుత్తర హిందూస్థానములో వాడియుండిరి, ఈశకము మీడియను సామ్రాజ్యమును జయించి పారశీక సామ్రాజ్యములో సమ్మేళన మొనర్చిన సైరసు దిగ్రేటు అనువానివలన ప్రారంభింపబడినది. సైరసునకును భారతీయసామ్రాట్టులకును కలిగియుండిన స్నేహసంబంధమువలన ఆశకమిచ్చటకూడను వాడబడినది. దీనిని శాలివాహనశకమనియు విక్రమ | కలి. 2552 | క్రీ॥పూ 550 |

శకమనియు కొందరు భ్రాంతిపడి శకకాల మనియు, శక నృపకాలమనియు మొదలైన పేర్లతో వాడబడినచోట్ల శాలివాహన లేక విక్రమశకముల ప్రారంభమునుండియు లెక్కించుకొనుటవలన చరిత్ర కాలములో వ్యత్యాసము గలిగి యనేక చిక్కులను గలిగించినది. గనుక శక కాలమును క్రీ॥ పూ॥ 550 సం॥రముగా నెంచి లెక్కించిన రాజచరిత్రములను సరిగా లెక్కించగలిగెదము. ఈశకము కలి. 2552సం॥ లేక క్రీ॥పూ 550 సం॥రమున ప్రారంభింపబడినది దీనిని గురించి ముందు భాస్కరాచారి కాలనిర్ణయ ప్రకరణమునందు వివరింపబడును.

౧౦. శ్రీహర్ష శకము (ఇతనికి శకారి, శకాంతక) కలిశకం క్రీ॥ పూ

శ్రీహర్ష విక్రమాదిత్యయను బిరుదులుగలవు. 2645—457
ఈశకము పూర్వము కాశ్మీరములో వాడుకలో నుండియున్నది.

౧౧. గుప్తశకము (ఇది గుప్తవంశములోని ప్రథమ రాజు చంద్రగుప్తుని పట్టాభిషేకకాలముగా యుతు ప్రారంభింపబడినది.

2775—327

౧౨. విక్రమశకము(మాళవ దేశాధీశుడగు విక్రమార్కునివలన యేర్పరుపబడినది. 3045—57

౧౩. శాలివాహనశకము 3179— 3180—
(క్రీ॥వె 78 సం॥రమునుండి ప్రారంభం)

## ఇతరశకములు

౧౩. కాన్స్టాంటినోపిలుశకము (ఈ పట్టణము కట్టిన క్రీ॥ పూ॥ తేదీనుండి ప్రారంభం) కలి పూ॥ 2406—1-9-5508

౧౪. అంటియోకుశకము( ,, ) కలి పూ॥ 2390—1-9-5492

౧౫. అలెగ్జాండ్రియాశకము( ,, ) కలి పూ॥ 2400—28-8-5502

౧౬. క్రైస్తవుల సృష్ట్యాదిశకము కలి పూ॥ 902— 4004.

౧౭. క్రీస్తుశకము కలిశకం 3102— క్రీ॥1

## క్రీస్తుశకము కల్పితము

| | |
|---|---|
| క్రైస్తవ సృష్ట్యాది క్రీస్తుపూర్వము— | 4004 |
| కాన్స్టాంటినోపిలుపట్టణం కట్టిన తేది క్రీ॥ పూ॥ | 5508 |
| అంటియోకు పట్టణం కట్టినది క్రీ॥ పూ॥ | 5492 |
| అలెగ్జాండ్రియా పట్టణం కట్టినది క్రీ॥ పూ॥ | 5502 |

క్రైస్తవులు చెప్పెడి సృష్టికాల పూర్వమే, దేవుడు భూమిని, ఆకాశమును సృజింపక పూర్వమే కాన్స్టాంటినోపిలు 1504 సం॥రములు నుండియు, అంటియోకు పట్టణం 1488 సం॥రముల ముందునుండియు అలెగ్జాండ్రియాపట్టణం 1498 సం॥రముల ముందునుండియు మహో న్నతస్థితిలో నుండియున్నవి. ఈ సృష్టికాల గణనమెట్టిదో యోచిం పుడు. పైశకముల జాబితాలో చివర (16. 17) శకములు (క్రైస్తవ శకములు) పందొమ్మిదవ శతాబ్దములో చేయబడిన గొప్ప ఫోర్జరీ లనియు (Grand forgeries of the 19th century) వానిని లెక్కలోనికి తీసుకొనదగినవి కావనియు, పైన చూపబడిన అంకెల వలన మీకే బోధపడుచున్నది. అందునుగురించి నాచే వ్రాయబడిన "ఆభాసక్రైస్తవము" అను గ్రంథములో విపులముగా చర్చింపబడి నది, కొద్దివివరములు దిగువ నీయబడినవి.

క్రైస్తవుల బైబిలు గ్రంథములో వారి సృష్ట్యాదికాలనిర్ణయము చేయబడియుండ లేదు, అట్లు చేయబడిననేగాని పాశ్చాత్య చరిత్రకారులకు పని గలుగదు. అందునిమిత్తం క్రైస్తవ పాదరీలసభ చేంబరు (Chamber) అను కమిటీ క్రీ॥ శ॥ 1849 వ సంవత్సరములో రోము పట్టణమున సమావేశమాయెను. ఈ చేంబరు (సభ)కు "యుషరు" అనునాయన "ఆర్చిభిషపు" ప్రధానుడు. ఆదిమదంపతులయిన ఆదాము, హవ్వలను వారలు సృష్టింపబడిన కాలమును గురించి తర్జనభర్జనలు జరిగిన మీదట ప్రథమసృష్టికాలము క్రీ॥ పూ॥ 4004సంవత్సరముగా నిర్ణయింపబడినది. గనుక యిప్పటికి సృష్టికాబడిన కాలము (4004 + 1944) 5948 సంవత్సరములుగా యీ దేవదూతలు నిర్ణయించిరి. ఈ సృష్టికాలనిర్ణయము జేయుటలో వారిచే యొనర్పబడిన సహేతుకమైన వాదనేమియో తెలియుటకు "ఆర్చిభిషప్ యుషరు" మహాశయుడు లోకమునకు నచ్చజెప్పిన మాటలనే మీముందు బెట్టెదను.

"As the memory of man extends back only to some point in his early boyhood, so the memory of our race extends back only to about 3000 years from the present date, leaving an indifinite space before that during which the infancy of species must have been transacted Nor does the scripural account of the creation settle this point. As many as two hundred different calculations as to the age of our species have been founded. by different divines on the statements of the sacred records the descripancy arising from the uncertainity of those texts of the Old Testament in which numbers occur. The longest of these calculations, dates the creation of man at about 8800 years from the present time or about 7000 years before the death of Christ, the system usually adopted by historians is that of Archbishop Usher, which fixes

the event at B. C. 4004 or 5853 years from the present date" (1849 A. D.)

'మనుష్యునికి జ్ఞాపకశక్తి వెనుకకుపోయిన చిన్నతనములో కొంతవరకే వ్యాపించును. ఆ ప్రకారమేగానే మన జాతియొక్క జ్ఞాపకశక్తి మూడువేల సంవత్సరములకు వెనుకకు మాత్రమే వ్యాపించుచున్నది. అంతకుముందింకను యనియుండెను కొంతకాలము మానవవికాసమునకు కాలీ వదలడమైనది. పవిత్రగ్రంథము బైబిలులో నెచ్చటను యాకాలనిర్ణయము చేయబడియుండలేదు. వివిధములైన రెండువందలు అంచనాలు వేయబడిన లెఖలు పాదరీలవలన ఏర్పడబడినవిగాని అవియన్నియు పవిత్రగ్రంథములలో సూచింపబడినవానికి విరుద్ధముగా నున్నవి. ఈయంచనాలలో హెచ్చుకాలముగా యివ్వబడినలెఖ యిప్పటినుండి 8800 వెనుకకు వెళ్ళుచున్నది. అనగా క్రీ॥పూ 7000 సం॥రములుగానున్నది దీనిని సభవారంగీకరింపలేదు. చరిత్రకారులు సాధారణముగా యుపయోగించునది "ఆర్చి బిషపు యుషరు"గారిచే నిర్ధారణ చేయబడిన క్రీ॥పూ. 4004 లేక యిప్పటికి 1849 సం॥రముకు 5853 సం॥రములు.

ఈ సృష్టి కాలనిర్ణయము వారికెట్టి శాస్త్రసిద్ధమైన ప్రమాణాధారముగాని లేక గ్రహగతుల ననుసరించిగాని చేయబడినదికాదు. ఒకమానవుని యూహామీద నాధారపడియున్నది. తమబుద్ధి మూడు వేల సం॥రములకు మించి వెళ్ళలేదని వారే యొప్పుకొనుచున్నారు. ఒకవేయి నాలుగు సంవత్సరములు మానవ వికాసమునకు గాను కలిపిన బాగుండునని యెంచి (3000+1004) 4004 B C.గా నిర్ధారణ చేయబడినది. A.D. 1849వ సంవత్సరములో యీనిర్ధారణ జరిగినందున 4004+1849 = 5853 సంవత్సరములు నిర్ధారణ కాలముకు యైనది. ఇందుకు విరుద్ధముగా దిగువ నుదహరింపబడిన యొక పాశ్చాత్య విద్వాంసుని యభిప్రాయమును జూడుడు.

"Of the period of two hundred and fifty thousand years or more that the human race has already in

existence" (An out line of modern *knowledge by Dr.* William Rose. London Page 4)

"రెండులక్షల యేబదివేల సంవత్సరములకు పూర్వమే మానవ జాతి సృష్టికాబడియున్నది." అని నవీనవిజ్ఞానమను గ్రంథములో వ్రాయబడినది. క్రీ॥ శ॥ 1800 సంవత్సరములో నున్న మనిషికి బుద్ధి మూడువేల సంవత్సరములకంటె వెనుకకు పోలేదనిన అర్థమేమి? వారిజాతి క్రీ॥పూ॥ 1200సంవత్సరము ఆప్రాంతముల ప్రారంభించి నట్లు యూహింపబడినది. పాశ్చాత్యుని బుద్ధి యెంత సంకుచితమైనదియు మనకు యిందువలన తెలియుచున్నది. వారు చెప్పినటుల క్రీ॥పూ॥ 4004 సంవత్సరము సృష్టికి ప్రారంభమని వాదనకొరకు అంగీకరించుదము. "క్రీస్తుకు పూర్వము" (B. C.) అనగానేమి? (A. D. కి ముందు అని జవాబు) క్రీస్తు చనిపోవుటకు పూర్వము అని జవాబు. A D, చావు పిమ్మట అనగా నేమి? ఇందుకు దేవమాతయైన యుషరు మహాశయు డిచ్చిన సమాధానము వినుడు.

"Systems of chronology differ with regard to the year of the crucification of the Saviour some placing it in A. D. 30 and others in A. D. 33."

క్రీస్తును శిలువ వేసిన సంవత్సరము నిర్ణయించుటలో అనేక భేదములున్నవి. కొంతమంది "చావుపిమ్మట" 30వ సంవత్సరముగాను, కొంతమంది 33వ సంవత్సరముగాను నిర్ణయించుచున్నారు."

ఇందుచే బట్టి (B. C.) "క్రీస్తుకు పూర్వము" అనగా "క్రీస్తు పుట్టుటకు పూర్వము" అని అర్థము చేసుకొనవలయును. (B.C.; A. D) 'పుట్టుటకుముందు' "చావుపిమ్మట" రెంటినడుమను యున్న వ్యవధి క్రీస్తుయొక్క జీవిత కాలము అది ముప్పదిసంవత్సరములని కొందరును, 33సంవత్సరములని కొందరును చెప్పుచున్నారు. ఈజీవితకాలముగాని, క్రీస్తుపుట్టిన తేదీగాని యిప్పటికిని నిర్ధారణ కాలేదు. ఇకను చరిత్రకారుల దృష్టిలో (A. D.) "చావుపిమ్మట" అనగా నేమియో విచారింతము. 'హెయిడర్ స్మిత్' అనునాయన 'చావుపిమ్మట' **A. D.అను**

దానిని గురించి 1840వ సంవత్సరములో 'చేంబరు' వారు చెప్పిన యభి
ప్రాయమునకు విరుద్ధముగా నీదిగువవిధమున చెప్పుచున్నాడు.

"Anno Domini A. D. The year of our Lord of grace, of the incarnation, of the circumscision and of the crucifixion The Christian Era Commenced 1st Jan in the middle of the 4th year of the 194 th Olympiad and 753rd year of the building of Rome, and in 4714 of the Julian period. The Era was invented by a monk Dionysius Exigus about 532 A D It was introduced in the 6th century and ordered to be used by Bishops by the council of Chelsea in 816; but was not generally employed for several centuries Charles 111 of Germany was the first who added in the year of our lord" to his reign 879 A. D. It was held that Christ was probably born in the year 4 or 5 A. D."

"ఎన్నోడొమిని" (ఎ. డి.) "మన ప్రభువుయొక్క సంవత్సరము" అనగా మన ప్రభువుయొక్క అవతారము. పరిశుద్ధమైన "సుంతి" కర్మ చేయబడుట, శిలువ వేయబడుటయు తటస్థమైన కాలము. క్రీస్తుశకము 1వ జనవరు 194వ ఒలింపియడుయొక్క నాలుగవ సంవత్సరములో ప్రారంభమైనది. మరియు రోము కట్టబడిన 753వ సంవత్సరమునన్ను, జూలియన్ శకము 4714 సంవత్సరమునన్ను మైయున్నది. ఈ శకము క్రీ॥ వె॥ 532వ సంవత్సరములో "డియోనిసియస్ యెక్సిడసు" అను సన్యాసివలన కనుగొనబడినది. ఆరవ శతాబ్దములో ఇటలీలో వాడుటకు ప్రవేశపెట్టబడినది. మతగురువుల వలన వాడబడుటకు ఛాల్సియా సంఘమువారివలన 816వ సంవత్సరములో యుత్తరువు చేయబడినది. గాని పిమ్మట యనేక శతాబ్దముల వరకు వాడబడి యుండలేదు. జర్మనీ రాజైన మూడవ ఛార్లెసుచే తన పరిపాలనలో మన ప్రభువుయొక్క 879 ఎ. డి. అని మొదట పర్యాయము ప్రారంభింపబడినది. క్రీస్తుజననము యీ శకములో

4 లేక 5 వ సంవత్సరముగా బహుశః యుండియుండ వచ్చునని నిర్ణయింపబడినది.

హెయిడన్‌స్మిత్ క్రీస్తుజననము, సుంతిచేయబడుట, శిలువ వేయబడుట (మరణము) ఎ. డి. లో ననుచున్నాడు. యుపరు చెప్పినది 30 లేక 33 ఎ. డి. అయియున్నది. లోతుకుదిగి విచారించగా యీ క్రీస్తుశకము బి. సి. ఎ. డి. గుర్తులు సృష్టికి మొదటివాడైన 'ఆదాము' పుట్టుకవలె క్రైస్తవ ఫాదరీల యూహాజనితము లేగాని సత్యమైనది కాదు. ఇదియే పాశ్చాత్య చరిత్రకారుల చరిత్ర నిర్మాణమునకు పునాది. సృష్టికి మొదటి పురుషునుపుట్టి యిప్పటికి 5948 సంవత్సరములయినదని స్థిరపరచబడినది. అనగా క్రీ॥ పూ॥ 4004 సం॥ ఈ క్రైస్తవశకము కేవల యూహాజన్యమైనందున ప్రమాణముగా తీసుకోదగినది కాదు.

## క లి శ క ము

భారతవర్ష చరిత్రయనగా 195 కోట్ల పైచిల్లర కాలములో జరిగిన మానవచరిత్ర యని యర్థము. సృష్ట్యాదినుండి ప్రపంచమంతటికి మానవులను, శాస్త్రములను, ధర్మములను, నాగరికతను సమకూర్చుచుండిన పుణ్యభూమియొక్క చరిత్ర. ఇట్టి అపారమైన కాలములోని చరిత్ర వ్రాయడము సామాన్యవిషయము కాదు. అందువలననే మన పురాణములు, పైకాలములోని ప్రాముఖ్య విషయములనుమాత్రము తీసుకొని చెప్పియున్నవి. అంతేగాక బ్రహ్మయొక్క మొదటి యేబది సంవత్సరములలోని కల్పములలో జరిగిన కథలుగూడను గలవు. దేవీ భాగవతములో చెప్పబడిన భండాసురవధ మొదలయిన కథలు పద్మకల్పములోనివి. అనగా బ్రహ్మ జననమొందినపిమ్మట సృష్టి ప్రారంభింపబడిన మొదటిరోజులోని కథలున్నూ ఆపిమ్మట కాలములోని కథలు కొన్నియును గలవు. గజేంద్రమోక్షణ కథ నాలుగవ మనువైన తామసుని కాలములో పాలసముద్రములోని త్రికూటపర్వతమందు జరిగిన కథ. నూరు కోట్ల సం॥ రముల క్రిందటిది. ఈ ప్రకారము బ్రహ్మదేవుని యనేక కల్పములలో జరిగినచరిత్రలలో ముఖ్య

మైనవాటిని చెప్పునవే మన పురాణములు. అంతేకాని యిప్పటి కాలపువారు ఊహాపోహలతో వ్రాయుచుండిన చరిత్రలవంటివి కావు. నవీనుల యూహాప్రపంచమున కందనివన్నియు కల్పితపురాణముల క్రింద పరిగణింపబడుట వారి మనోదౌర్బల్యమును జూపు చిహ్నముగా తెలియవలెను.

భారతవర్ష చరిత్ర రెండుభాగములు. అందు మొదటిది పూర్వచారిత్రకము. అనగా చరిత్రకందని ప్రాచీనకాలపు చరిత్ర. అది క్లుప్తముగా పురాణముల రూపమున భద్రపరుపబడినది. రెండవది చారిత్రకము. అనగా మన నవీన చరిత్రకారుల దృష్టి కందగలది అది క్రీ॥ పూ॥ 4938 సం॥ రములనుండి మాత్రమే. గనుక చారిత్రక కాలమును నిర్ణయించుటకు కలి ప్రారంభకాలమును మనము ప్రాతిపదికగా తీసికొనవచ్చును గనుక దాని ప్రారంభమును స్థిరపరచుదము. కలిప్రారంభసం॥రము భారతవర్ష చరిత్రలో అతి ప్రాముఖ్యము గలదిగా పరిగణింపబడుచున్నది. కలిశకము మొదటి సం॥రము అర్జునునికి మనుమడును మహాభారత యోధుడైన అభిమన్యుని పుత్రుడు నైన "పరీక్షితుడు" భారత వర్షాధినేతగా అభిషేకింపబడిన సం॥రము. (౨) శ్రీకృష్ణభగవానుడు తన యవతారమును చాలించిన సం॥రము (౩) చరిత్ర ప్రసిద్ధమైన ద్వారకానగరము సముద్రములో మునిగిపోయిన సం॥రము (౪) పాండవులు ద్రౌపదితో సహా పరీక్షితునకు రాజ్యమిచ్చి మహాప్రస్థానమునకు వెళ్ళిన సం॥రము. (౫) సర్వయాదవులు నశించిన సం॥రము. (౬) శ్రీ వేదవ్యాసభగవానునిచే "జయ" యను పేరున అరువది లక్షల గ్రంథముగా భారతేతిహాస ప్రారంభమైన సం॥రము (౭) జయాభ్యుదయ యుధిష్ఠిరశక ప్రారంభ సం॥రము

కలిప్రవేశమునకు ముందుజరిగిన చరిత్ర ప్రాముఖ్య విషయములు.

౧. మహాభారతయుద్ధము (క్రోధకృతు నామసం॥ర కార్తీక బ॥ 30 మంగళవారం మొదలు మార్గశీర్ష బ ౨ వరకు)

౨ యుధిష్ఠిర పట్టాభిషేకము (క్రోధకృతు సం॥ర పుష్యమాసము)

3. భీష్మనిర్యాణము, (అతి ప్రాముఖ్యముగలది) (శ్లో భరకృతుసం॥ మాఖ శు ౮ రోహిణీనక్షత్ర తృతీయపాదమందు పగలు 12 గంటలకు అభిజిన్ముహూర్తమందు జరిగినది.)

౪. పాండవుల అశ్వమేధము. (క్రోధిసం॥ర చైత్రశు౧ రోజున అశ్వము విడువబడినది. ఆ సం॥ర మాఖశు ౧౫ నాటికి దిగ్విజయము చేసి అశ్వముతో అర్జునుడు హస్తినాపురమునకువచ్చినాడు విశ్వావసు సం॥ర చైత్ర శు॥ ౧౫ యజ్ఞదీక్ష.)

కలియుగప్రారంభము శ్రీకృష్ణ నిర్యాణము జరిగినరోజుననె ప్రారంభమైనది.

శ్లో॥ "యస్మిన్ కృష్ణోదివం యాతస్తస్మిన్నేవ తదాహని। ప్రతిపన్నం కలియుగం తస్యమానం తస్య మేశృణు" మత్స్య. 271 అధ్యా [51-52 శ్లో॥

ఈ విషయములో భేదాభిప్రాయము లేదు. శ్రీకృష్ణనిర్యాణము పిమ్మట కొన్నిదినములకే పరీక్షిత్తు పట్టాభిషేకము, పాండవ మహాప్రస్థానగమనము జరిగినది. కలిశకమును శ్రీకృష్ణనిర్యాణశకమని చెప్పవచ్చును. శ్రీకృష్ణ నిర్యాణమైన క్షణమునుండియే కలిప్రవేశమైనట్లు పురాణేతిహాసములు చెప్పుచున్నవి. భారతీయులు జన్మదినములకన్న నిర్యాణ దినముల నెక్కువగా జ్ఞాపకముంచుకొందురు. జన్మదినము పురుషుని మరణముతోడనే మరుగుబడును గాని మరణమాతని పుత్రపౌత్రాదులు ప్రతిసం॥రము జరుపవలసిన శ్రాద్ధముల నిమిత్తం తప్పని సరిగా నియమములతోసహా జ్ఞాపకముంచుకొందురను సంగతి భారతీయుల సాంప్రదాయము నెఱిగినవారందరికి తెలిసిన సంగతియేకదా! తమతల్లిదండ్రులు మొదలయినవారేదినమున చనిపోయిరో సరిగా నాదినముననే ప్రతిసంవత్సరము తప్పక "ఆబ్దికము" పెట్టితీరవలయును. ఆ మృతదినమును పొరపాటుననైన మరువరాదు. అట్లు మరచినవాడు ధర్మబాహ్యుడగును. తిరిగి ప్రాయశ్చిత్తమొనర్చుకొని యుపవసించి "ఆబ్దికమును" పెట్టవలసియుండును. మృతుని కాబ్దికము పెట్టక యుపేక్షించినవాడు ధర్మబాహ్యుడై కులబహిష్కారుడగును.

"మృతాహం సమతిక్రమ్య చండాలః కోటిజన్మసు"

తా. మృత తిధిని అనగా అబ్దికదినము నతిక్రమించినవాడు కోటిజన్మలలో చండాలుడుగా పుట్టును.

గనుక మృతదినములు బహుజాగ్రత్తగా కాపాడుకొను ఆచారము నేటికిని భారతవర్షములో పరంపరాగతమైయున్నది. గనుక శ్రీకృష్ణ నిర్యాణ మీదినమువరకును భారతవర్షమందతిజాగ్రత్తగా కాపాడబడి నది. "వత్సరాది" అనగా తెలుగువారి సంవత్సరాది. తెలుగుదేశ మందంతటను బహు పవిత్రముగా నెంచబడుచున్నది. ఇదియే "శ్రీకృష్ణనిర్యాణ దినము" కలిశక ప్రారంభముకూడ నిదియే అన్ని వర్ణములవారును "వత్సరాది" పండుగ నాచరించుచున్నారు. దీనిని మరచుటకుగాని, యుపేక్షించుటకు గాని వీలు లేదు. ఇది భారతవర్ష ప్రజల సాంప్రదాయ పరంపర మాత్రమేగాక ఖగోళములోని గ్రహ కూడిక వలనను గూడ స్థిరపరుపబడుచున్నది. ఆధునిక పాశ్చాత్య ఖగోళ శాస్త్రపండితులు గూడను దీనిని క్రీ॥ పూ॥ 3102 సం॥ రమని స్థిరపరచియుండిరి. భారతవర్షమునందు జన్మించిన ప్రతివానికి జన్మ కాలము జాగ్రత్తగా కాపాడుకొని జాతకములు వ్రాయించుకొను నాచారమిప్పటికిని బహువిరివిగా గనుపడుచున్నది పూర్వకాలములో జాతకములు వ్రాయించుకొనుటయందు ప్రజలందరు యిప్పటికంటె నెక్కువ శ్రద్ధ వహించెడివారు. సామాన్యమానవులే యిట్టి శ్రద్ధ వహించియుండగా మానవకోటి కాదర్శప్రాయులుగా నుండిన వ్యక్తుల విషయములో మరింత హెచ్చుశ్రద్ధ తీసికొనబడినదనుటలో ఆశ్చర్యము గాని, అతిశయోక్తిగాని లేదు. గనుక ప్రామాణికముగా నెంచబడు ప్రతివిషయము ఖగోళ గ్రహముల నడకనుబట్టి లెఖమాడబడుచుండిన దని స్పష్టపడుచున్నది. ఈలెఖ నిముసములు, సెకండ్లతోసహా వేయ బడును. భారతవర్షమందు ఖగోళశాస్త్ర మతిప్రాచీనకాలమునుండి ప్రచారమునందుండియున్నది. పరిశోధకులకు ఖగోళములోని గ్రహ సంచారము లెక్కువ ఖచితముగా కాలనిర్ణయము జేయుటకు తగిన సాధనములుగా నెంచబడినవి, కాని పాశ్చాత్యవిద్వాంసులు భారత

వర్షచరిత్రను వ్రాయునపుడీభగోళశాస్త్ర విషయములను బుద్ధిపూర్వకముగా వదలియున్నటుల స్పష్టపడుచున్నది. అట్లనుసరించిన యెడల వారి సిద్ధాంతము లిట్లు పరిహాసపాత్రములుగా నుండెడివికావు.

వేదకర్మలాచరించుట కర్హమైన కాలవిశేషము జ్యోతిశ్చలనమువలన గలుగును. అట్టి జ్యోతిస్సులు అయిదువిధములు.

౧. బింబగ్రహములు. ౨. తారాగ్రహములు 3. మందోచ్చలు, ౪. విలోమగతిగల పాతలు ౫. నక్షత్రములు. వీనిచలనముల వలన కాలవిశేషము లేర్పడును. ఈకాలవిశేషములు ౧. ప్రజాపతి లోకము ౨. బృహస్పతిలోకము 3. దేవలోకము, ౪. పితృలోకము. ౫. మనుష్యలోకము. అను అయిదు లోకములకు సంబంధించి యుండును. గనుక మనుష్యలోకమున శాస్త్రోక్తకాలమం దనుష్ఠింపబడిన యాగాది (శుభాశుభ) కర్మలయం దివ్వబడు హవ్య కవ్యాదులు తత్తల్లోకవాసులగు దేవతలకు సంక్రమించుటవల్ల మనుజులకు పారలౌకిక సుఖములు గలుగుటకు హేతువులగును. ఇట్టి విషయపంచకము తోగూడిన పంచాంగములు భారతవర్షములోని ప్రతి భారతీయుని యింటియందుంచుకొనబడుచున్నది. అందు వారములు, తిథులు, నక్షత్రములు, యోగము, కరణము మొదలైన వివరములును, మారుచుండెడి గ్రహముల చారలును, (నడకలు) నెలలు, సంవత్సరములు, యుగములు, మనువులు, కల్పములు, సృష్ట్యాదులు మొదలైన వివరములన్నియు వ్రాయబడియుండును. (మన చరిత్రకారుల దృష్టిలో నీ పంచాంగములుకూడ మరుగుపడినవి.)

భారతీయుల జ్యోతిష గణితములు మానవలోకమునకు మాత్రమేగాక మానవదృష్టి కగోచరములగు యితరలోకములకు గూడను సమన్వయించులాగున కాలమానములు సరిపుచ్చబడియున్నవి మనముజేయు ప్రతిసత్కర్మయు యితరలోకవాసులతో సంబంధించి యుండుటవలన నాయాలోకములలోని కాలమానములతో సరిపుచ్చబడియున్నవి. అంతేగాని తమ భూగోళముతప్ప యితర లోకము

లేవియు లేవని జెప్పెడి హ్రస్వదృష్టిగల పాశ్చాత్యవిద్యాధికులు, చెప్పుచున్నప్రకారము సంఖ్యలను వృద్ధిజేయుటకొరకు కల్పింపబడినవి కావు. నవీనులు యితరలోకములను జూచుటకును, వెళ్ళివచ్చుటకును జెప్పబడిన శాస్త్రప్రమాణముల ప్రకారమాచరించుశక్తి లేనందున వానిని విశ్వసింపవీలులేదను యొక్కమాటతో వానిని ద్రోసిరాజను చున్నారు. అట్టిశక్తిని సంపాదించినవారు యితరలోకములను జూడ గలుగుదురు. ఇతరలోకము లనేకములుండ నచ్చుననియు అచ్చట జీవులు భూమిమీద మనమున్నటులనే నివసించియుండనచ్చుననియు యిప్పుడిప్పుడు పాశ్చాత్య ఖగోళపండితులు చెప్పుచున్నారు. ఇకను మన నవీన హైందవ పండితులు వారిమాటలను విశ్వసించియైనను మన శాస్త్రివాక్యములయందవిశ్వాసమును వీడుదురుగాక!

మానభేదములు:— 1 బ్రహ్మమానము 2 ప్రాజాపత్యమానము 3 బార్హస్పత్యమానము 4 దివ్యమానము 5 పిత్రుమానము 6 సౌరమానము 7 సావనమానము 8 చాంద్రమానము 9 నక్షత్ర మానము. అని తొమ్మిదిమానములు గలవు.

## వివరములు

1. నక్షత్రమానము:- అశ్విన్యాది నక్షత్రము తూర్పున ఉదయించి నదిమొదలు, తిరిగి ఆ నక్షత్రమే, తిరిగి తూర్పున ఉదయించుటకు గల మధ్యకాలమే నక్షత్రదినము ఇది యెల్లప్పుడు ౬౦ ఘడియలు. ఇట్టివి 30 దినములు. ఒకమాసము. ౧౨ మాసములొక సం॥ రము. ఈ నక్షత్ర సం॥రమునకు 359 సావన దినములు. వర్షఫలాది విచారణయు, మనుజుల ఆయుర్దాయమున్నూ యీ నక్షత్ర మానముచే వ్యవహరింపబడును.

2. సావనమానము:- సూర్యోదయ కాలమునుండి సూర్యోదయమువరకు గల మధ్యకాలమునకు సావనదినమని పేరు. ఇవి 360 ఒక సం॥రం అగును. సావనదినము నియమముగాదు. దీని ప్రమాణము భారతవర్షములో ఘ. 60-12 నుండి 60-6 ఘడియలు

లోపుగా నుండును. ఈ సావనమానముచే యాగాదులందు దిన గణనము, జాతమృతాశౌచములందు దినగణన, గ్రహముల దిన గతి, దిన, మాస, అబ్దాదిపతుల సాధన, వృద్ధి (వడ్డి) గణనము, స్త్రీగర్భగణన మొదలగునవి వ్యవహరింపబడును.

3. చాంద్రమానము:- రవి చంద్రుల కలయిక రూపమగు దర్శాంతకాలమునుండి తిరిగి కలయికయగు దర్శాంతమువరకుగల మధ్యకాలమునకు చాంద్రమానమని పేరు. ఆ మానమందలి ముప్పదవ వంతగు తిథికే చాంద్రమాన దినమని పేరు, ఈ సంవత్సరమునకు దినములు 354-11 38 మధ్యమమానముచే నగును. ఇట్లే మధ్యమ చాంద్రమాన దినాది 29-30-58 చాంద్రదిన ఘటికలు. 59-2-0 చంద్రస్ఫుట గతి ననుసరించి యివి మారుచుండును. ఈ మానముచే తిథి, నక్షత్రాదుల గణన, సమస్తకర్మలు, వ్రతములు మొదలగునవి వ్యవహరింపబడును, అధిక మాసము వచ్చిన చాంద్రసంవత్సరమునకు దినములు 384 సుమారుగానుండును.

4. సౌరమానము:- సూర్యుడు పౌష్ణాంతరూపశాస్త్రీయారంభ స్థానమునుండి బయలుదేరి తిరుగుచూ తిరిగి ఆరంభస్థానమునకు చేరు మధ్యకాలమునకు అనగా మేషసంక్రమణమునుండి తిరిగి మేషసంక్రాంతివరకు సౌర సం॥రము. ఇవి రోజులు 365-15-31 అగును. సూర్యుడొక రాశి నతిక్రమించుకాలము సౌరమానము. ఇది మధ్యమ మానముచే 30 రోజులు 26 ఘడియలు 18 విఘడియలగును. సూర్యుడు రెండురాసుల నతిక్రమించుకాలము ఋతువనూ, ఆరు రాసుల నతిక్రమించుకాలము అయనమనూ అగును. మకరసంక్రమణమునుండి కర్కాటసంక్రమణమువరకు ఆరు మాసములు ఉత్తరాయణమనియు కటకసంక్రాంతినుండి మకరసంక్రాంతివరకు ఆరు మాసములు దక్షిణాయనము అనియు సంజ్ఞ. ఈ సౌరమానముచే మహాయుగాది సంవత్సర గణనము, అయనములు, సంక్రమణములు దినరాత్రి ప్రమాణసాధన, షడ

శీతులు మొదలగునవి వ్యవహరింపబడును. షడశీతియనగా 86అని అర్థము. తులారాశిలో ప్రథమభాగమునుండి ప్రతి 86 భాగలకు ఒక్కొక్క షడశీతి యగును. గాన ధనూరాశిలో 26 వ భాగయు మీనరాశిలో 22 వ భాగయు, మిథునరాశిలో 18 వ భాగయు, కన్యారాశిలో 14 వ భాగయు, షడశీతులనబడును కన్యారాశిలో మిగిలిన 16 భాగలకు మహాలయములని పేరు. మేష, తులాసంక్రమణములకు విషువత్పుణ్య కాలమనియు, వృషభ, సింహ, వృశ్చిక, కుంభ సంక్రమణములకు షడశీతి పుణ్యకాలమనియు, మకరసంక్రమణమునకు ఉత్తరాయణమనియు కటకసంక్రమణమునకు దక్షిణాయనమనియు పేర్లు.

5. బార్హస్పత్యమానము:- మధ్యగురుని (గణితముచే మధ్యగురుడు సిద్ధించును. రాశి భోగకాలము యీ మానముచే సం॥రము మధ్యగురుని రాశి ప్రవేశకాలమే యీ సంవత్సరారంభము. అభీష్టకాలమునకు సృష్ట్యాది గత సం॥ర సంఖ్యను 60చే భాగింపగా వచ్చు లబ్ధమునువదలి శేషమును విజయ సం॥రమాదిగా లెక్కించిన బార్హస్పత్యమాన సం॥రము వచ్చును.

ఈ మానముచే ప్రభవాది షష్ట్యబ్దగణనము వ్యవహరింపబడును ఈ సంవత్సర ప్రమాణము 361 దినములు 1ఘడియ 36 విఘడియలు మధ్యగురునకు రాశి ప్రవేశము లేని చాంద్రసం॥ర మధిక సంవత్సరమనియు, మధ్యగురునకు రెండురాశి సంక్రమణములు ఒక చాంద్ర సంవత్సరమందు గలిగినపుడది క్షయసంవత్సరమనియు, చెప్పబడును.

బృహస్పతిలోకవాసులకు, గురుడు శాస్త్రీయారంభ స్థానము నుండి తిరిగి ఆస్థానమునకు చేరుకాలము) ఒక చక్రభ్రమణము చేయు కాలము ఒక అహోరాత్రము గాన 43, 20, 000 సౌరవత్సరములు గల మహాయుగములో బృహస్పతి లోకవాసులకు 364220 దినములు అగును. అనగా వేయి (1000) సంవత్సరములగును. వీరి మానములో సంవత్సరమునకు 364 రోజుల 13ఘడియల 12విఘడియలు.

6. పితృమానము:- ఒక చాంద్రమానము పితృదేవతలకొక రోజగును. అందు అమావాస్య పితరులకు మధ్యాహ్నము శుద్ధాష్టమి సూర్యాస్తసమయకాలము; పూర్ణిమ అర్ధరాత్రి. కృష్ణాష్టమి సూర్యోదయము. ఒక మహాయుగకాలము. 43,20,000 సంవత్సరములలో 5,34,33,336 చాంద్రమానములుండును. గాన ఒక మహాయుగ మనగా 5,34,33,336 పితృలోక దినములు, అనగా 1,44,000 పితృసం॥రములు వారి మానములో సంవత్సరమునకు 371రోజులు 3 ఘడియలు 53 విఘడియలు.

7. దేవమానము:— ఒక సౌరసంవత్సరము దేవతలకహోరాత్రము! అందు మేషాది ఆరుమాసములు పగలు, తులాది ఆరుమాసములు రాత్రి. మేషసంక్రమణము సూర్యోదయకాలము, కటక సంక్రమణము మధ్యాహ్నము, తులాసంక్రమణము సూర్యాస్తమయ కాలము, మకరసంక్రమణము అర్ధరాత్రియు నగును. గాన మహాయుగ మనగా 43,20,000 దేవ దినములు అనగా 12,000 సంవత్సరములు.

8. ప్రజాపతిమానము:— 71 మహాయుగములున్నూ, ఒక కృతయుగ ప్రమాణ సం॥ర కాలసంధియు కలిసి మన్వంతరమగును. ఇదియే ప్రజాపతిలోకమునకు దినము. ఈ దినమనగా 71,400 గురు సంవత్సరములు లేక 8,56,800 దివ్యసం॥రములు లేక 1,02,81,600 పితృ సం॥రములు లేక 30,84,48,000 భూలోక వత్సరములు.

9. బ్రహ్మమానము; 14 మన్వంతరములున్నూ, ఒక కృతయుగ సంధియు కలిసి బ్రహ్మకు వకపగలు. ఇదియే కల్పము. ఇంత కాలమే రాత్రి. ఇట్టి అహోరాత్రములతో నొప్పు నూరు సంవత్సరములు బ్రహ్మకు పరమాయుర్దాయము.

ఆయా లోకవాసులకు ఆయామానములచే నూరు సంవత్సరములు రమాయుర్దాయము.

పై అన్నిమానములలోను మహాయుగాదుల ప్రమాణములు వేరు వేరుగా ప్రదర్శింపబడుచున్నవి.

| మనుష్యలోకము | పితృలోకము | దేవలోకము | బృహస్పతిలోకము | ప్రజాపతిలోకము |
|---|---|---|---|---|
| 1 సంవత్సరము. | 12 రోజులు | ఒకరోజు | 5 ఘడియలు | ... .... |
| 60 సంవత్సరములు | 2 సంవత్సరములు | ఋతువు | 5 రోజులు | నిమేషము |
| కలియుగము 4,32,000 సం॥ | 14,400 సం॥ | 1200 సం॥ | 100 సం॥ | 6 విఘడియలు |
| ద్వాపరయుగము 8,64,000 సం॥ | 28,800 సం॥ | 2400 సం॥ | 200 సం॥ | 12 ,, |
| త్రేతాయుగము 12,96,000 సం॥ | 43,200 సం॥ | 3600 సం॥ | 300 సం॥ | 18 ,, |
| కృతయుగము 17,28,000 సం॥ | 57,600 సం॥ | 4800 సం॥ | 400 సం॥ | 24 ,, |
| మహాయుగము 43,20,000 సం॥ | 14,4,000 సం॥ | 12000 సం॥ | 1000 సం॥ | 1 ఘడియ |
| మన్వంతరము 30,67,20,000 సం॥ | 1,00,88,000 సం॥ | 9,24,000 సం॥ | 77,000 సం॥ | 1 రోజు |
| కల్పము 432,00,00,000 సం॥ | 14,40,00,000 సం॥ | 1,20,00,000 సం॥ | 10,00,000 సం॥ | 1 పక్షము |

## కృతాదియుగములు

భూమికి సూర్యుల కుండు దూరముయొక్క హెచ్చు తగ్గుల ననుసరించి కృతాది నాలుగు యుగములు సాపేక్షికముగా పూర్వులచే విభజింపబడినది. ఒకమహాయుగములోని నాలుగు దశమాంశలు కృతయుగమనియు, మూడు దశమాంశలు త్రేతాయుగమనియు, రెండు దశమాంశలు ద్వాపరయుగమనియు, ఒక దశమాంశము కలియుగమనియు విభజించబడినది. ప్రతియుగములోను (12వ, వంతు) ద్వాదశాంశ ఆదిసంధియు, అంతియో నంతిమ సంధియునగును.

## అధిక మాసము

| | రో. | ఘ. | విఘ. | వి. | వి. |
|---|---|---|---|---|---|
| సౌరవర్ష ప్రమాణదినములు | 365 | 15 | 31 | 31 | 24. |
| చాంద్రసంవత్సర ప్రమాణదినములు | 354 | 11 | 38 | 7 | 24. |
| తీసివేయుగా తేడా | 11 | 3 | 58 | 24 | 0 |

ఇదియే అధికమాసమునకు బీజము. ఇది యెల్లపుడును, చాంద్రమాసారంభకమగు దర్శాంతమునకును, సౌరమాసారంభకమగు సంక్రమణమునకును, మధ్యనుండును. ఇది క్రమముగా వృద్ధియగుచు 30 దినములగునపుడు అధికమాసము వచ్చును. ఇంక ననేక వివరములు మన పంచాంగములలో నుదహరింపబడి యున్నవి.

అట్టిపంచాంగములు కలిప్రారంభమునుండియు 'కల్యాదిగతాబ్దాః' అని కలిశకమును మొదటినుండి ఒకటి, రెండు, మూడు, నాలుగు యిత్యాదిగా నేటివరకు కలిశకాబ్దాః 5044 అనిక్రమముగా నొక్కొక వత్సరమునే కలుపుకొనుచు నేటివరకు లెక్కించి యున్నవి. ఇంకను ముందుకూడా లెక్కించుచునే యుండును. ఇట్లు సృష్ట్యాది నుండియు నేటివరకు పరంపరాగత మగుచుండిన పంచాంగముల

లోని లెక్కలను విడచుట నేలవిడిచిన సాముగాక మరేమగును! భారతవర్షమందు ద్విజులందరును తాము నిత్యము త్రికాలములందును జేసెడి సంధ్యావందనమునందును, చాతుర్వర్ణ్యములవారు నాచరించెడి శుభాశుభ కర్మలయందును, దేవాలయములలో నిత్యము షట్కాలములందు గాని లేక నాయా సాంప్రదాయానుసారముగా నాచరించెడి దేవపూజా విధానములందును, నేటివరకును స్మరింపబడుచున్న కాలగణనములయందును, యీ కలి ప్రారంభకాలము విధిగా లెక్కింపబడుచునే యున్నది.

కలి ప్రవేశమునకు పూర్వమున జరిగిన కొన్ని ప్రాముఖ్య విషయములకు కాలనిర్ణయములను సప్రమాణముగా దిగువ నిచ్చుచున్నాము.

౧. మహాభారతయుద్ధము:— శోభకృతునామ సం॥ర కార్తిక బ 30 మంగళవారం — కలిపూర్వం 36 సం॥

౨. ధర్మరాజు పట్టాభిషేకము. డిటో సం॥:- డిటో పుష్యమాసములో ధర్మరాజు రాజ్యపాలనము 36సం॥రములు కలిపూ॥ 36-కలి1వరకు — శ్రీకృష్ణభారతం మౌసల పర్వం ౧-౨; ౧-౬

3. ధృతరాష్ట్రుడు 15సం॥రములు పాండవుల వద్దనుండిపిమ్మట వనమునకేగుట — కలిపూ 21 సం॥
ధృతరాష్ట్రుని దేహ త్యాగము — కలిపూర్వము 18 సం — శ్రీ కృష్ణభారతం ఆశ్రమవాస పర్వం॥ ౧. ౫;౧. 3౧; ౧.33;

౫. క్రోధిసం॥ మాఘశు ౧౨ దినమునఅర్జునుడు యజ్ఞాశ్వములోడ హస్తినాపురం వచ్చుచున్నాడని కబురు రాజుకు చేయుట. — కలి పూ॥ 35 సం॥ శ్రీకృష్ణభారతం అశ్వమేధం ౮. ౧౮౮.

౫. విశ్వావసు చైత్ర శుం౧౫ అశ్వమేధ యజ్ఞ దీక్ష ధర్మరాజుచే గైకొనబడినది. — కలి.పూ 34 సం॥ అశ్వమేధం 3-౨౬౧

౬. శ్రీకృష్ణనిర్యాణమునూ్ను, పిమ్మట పరిక్షిత్తుపట్టాభిషేకము పాండవులు రాజ్యమును వీడి భూప్రదక్షిణమునకు బోవుట — కలి, 1సం॥ లేక యుధిష్ఠిర శకం 36 సం॥

౭. ధర్మజుని స్వర్గారోహణానంతరము ఆయన జ్ఞాపకార్థము లౌకికాబ్దము లేక 'లోక కాలము' (దీనినే సప్తర్షి యుగమందురు) అను శకమేర్పడిన కాలము, దీనిని యుధిష్ఠిరకాలమని కూడ వాడియుండిరి. దీనికిని 'జయాభ్యుదయ యుధిష్ఠిరశకము''నకును సంబంధము లేదు. (''జయాభ్యుదయ యుధిష్ఠిరశకము'' కలి 1సం॥రమున ప్రారంభింపబడినది.) — కలి 26 సం॥

శ్లో॥ ''పంచ వింశతి వర్షేషు ప్రయాతేషు కలౌయుగే॥
యుధిష్ఠిర జ్ఞాపనార్థం లౌకికోఽబ్దః ప్రవర్తితః॥
(కలియుగ రాజవృత్తాంతము 3వ అధ్యాయము)

# సప్తర్షి మండలం

(The Great Bearor Ursa major)

28వ మహాయుగములోని కృతయుగాదియందుండిన సప్తఋషుల యునికివిషయము బ్రహ్మసిద్ధాంతమందీవిధముగా చెప్పబడినది.

శ్లో॥ యుగాదే విష్ణుతారాయాం క్రతుచాద్య స్సమంతతః।
''ప్రాచ్యాత్రతం స్త్రైః పులహః పులస్త్యోధ దశాంశకైః॥
అత్రిస్త్రిత్రిభిర్భాగై రంగిరా అష్టభిస్తతః।
వశిష్ఠ స్సప్తభిస్తస్మాన్మరీ చిర్దశభిస్మృతః॥''
''ప్రత్యబ్దాత్ గతిస్తే షామష్టౌలిప్తా మునీశ్వరః'' (బ్రహ్మ సిద్ధాంతం)

తా॥ కృతయుగాదియందు సప్తఋషులలో క్రతువు శ్రవణమందును, వానికి మూడంశముల దూరమందున తూర్పుగా పులహుడును వానికి (దిగువను) పది యంశముల దూరమున పులస్త్యుడును వానికి (పశ్చిమముగా కొంచెము దిగువను) మూడు భాగలదూరమున అత్రియు, వానికి దిగున యెనిమిది భాగలదూరమున అంగీరసుడును, వానికి దిగువను యేడంశముల దూరమున వశిష్ఠుడును, వానికి(దిగువ కొంచెము తూర్పుగా) పదిభాగల దూరమున మరీచియు నుండిరి. వీరే సప్తఋషులు'' పటములో చూడుడు)

''ఈ సప్తఋషులు ప్రతి సం॥ తూర్పుగా (సవ్యముగా) యెనిమిది లిప్తలు జరుగుచుందురు,'' (ఈప్రకారము జరుచు రాగా 360 డిగ్రీలుగల ఖగోళము నొక్కమారు చుట్టుటకు 2700 సం॥ రములు పట్టును.) ఒక డిగ్రీకి అరువది లిప్తలు. సం॥ 1కి 8 లిప్తలు చొ॥ జరుగగా ఒక డిగ్రీ తిరుగుటకు 7 1/2 సం॥ రములు పట్టును. 360 డిగ్రీలకు 360 × 7 1/2 = 2700 సం॥ రములు. ఈ విషయమే బ్రహ్మ సిద్ధాంతములో ''ఖఖ నక్షత్ర వర్షాణి తిష్ఠంతి ముని వల్లభాః॥'' సప్తఋషులు 2700సం॥రములలో తిరిగి స్వస్థానముకు వచ్చియుందురని చెప్పబడినది.

ఉత్తరం

౨౮-వ మహాయుగములోని

# కృతయుగాదియందు సప్తఋషులయొక్క యునికి

ధృవనక్షత్రము ★ } శ్రవణం ౧ పాదం 3 భాగలు

క్రతువు — ★ ★ పులహుడు శ్రవణం ౨ పాదం

3 భాగలు

★ పులస్త్యుడు ధనిష్ఠ ౨ పాదం

3 భాగలు

ధనిష్ఠ 3 పాదం అత్రి ★

పడమర 8 భాగలు తూర్పు

శతభిషం ౨ పాదం అంగీరసుడు ★

యేడు భాగలు

(అరుంధతీ) ★★ వశిష్ఠుడు పూర్వాభాద్రా ౧ పాదం

పది భాగలు

★ మరీచి ఉత్తరాభాద్రా ౧ పాదం

దక్షిణం

## సప్తర్షి మండలమున్న నక్షత్రమును గుర్తించువిధానము.

ఈ విధానములో మూడువిధములగు యభిప్రాయ భేదములు గలవు. అందు మొదటి వాదము "సప్తర్షు లుదయించు సమయమున ముందరిభాగమున మొట్టమొదట గనపడు పులహా, క్రతువులకు సమముగ దక్షిణోత్తరముల కొక రేఖను గీచిన యీరేఖ యేనక్షత్రమందుండునో యానక్షత్రమున సప్తఋషులుండిరని గ్రహింపవలెను" ఈ విధానము విష్ణుపురాణమునకు ఆత్మప్రకాశిక యను పేర వ్రాయబడిన వ్యాఖ్యానములో గలదు. ఈ విధానము ననుసరించి కలి ప్రారంభకాలమున సప్తర్షులు మఖలో మూడవపాదమును దాటి నాలవ పాదమున ప్రవేశించిరి. ఈ వాదం ప్రకారం సప్తర్షులు సవ్యముగా చక్రమును చుట్టి వత్తురు. కలి 5044సం॥ మఖ నాలవ పాదమున నుండిరనియు పూర్వ ఫల్గునిని సమీపించుచుండినట్లును చెప్పుచున్నారు.

రెండవ వాదము:— "సప్తర్షులలో తూర్పుదిక్కుగనుండు తారలకు మధ్య సమముగ నర్ధరాత్రమున నే నక్షత్రము గన్పట్టుచుండునో సప్తర్షు లానక్షత్రమునం దుందురు." యీ వాదము ప్రకారము గూడ కలి ప్రారంభమున సప్తర్షులు మఖయందుండిరి. వీరు చక్రము నపసవ్యముగా చుట్టుదురని వీరిమతము. కలి 5044సం॥ హస్తలోకి వచ్చి యిరువది సంవత్సరములైనట్లు చెప్పుచున్నారు.

మూడవ వాదము:— 'సప్తర్షు లుదయించుసమయమున ముందుభాగమున తోలుదొలుత గనుపట్టు పులహాక్రతువులకు మధ్య సమముగ ముందుభాగమున నర్ధరాత్రమునందే నక్షత్రము గన్పట్టునో యానక్షత్రమున సప్తర్షు లుందురు.' ఈ వాదముప్రకారము కలియుగాదిని సప్తర్షులు కృత్తికానక్షత్రమునం దుండియున్నారు. సప్తర్షులు అపసవ్యముగా తిరుగుచుందురనియే వీరిమతము. కలి 5044 సం॥రమున ఆర్ద్రానక్షత్రముకు వచ్చి యిరువది సంవత్సరములైనదని వీరు చెప్పుచున్నారు.

పై మూడు వాదములలో మొదటివాదమే సమంజసముగా నున్నటుల దోచుటవలనను, యిప్పుడాకాశమున జూచియు, సిద్ధాంతులకు జూపి, వారి యభిప్రాయము ననుసరించియు, కృతయుగాదిని క్రతు పులహులు శ్రవణ నక్షత్రమం దుండినట్లు చెప్పబడెను. బ్రహ్మసిద్ధాంత వాక్యముననుసరించి యిప్పటివరకు లెక్క వేసియు మొదటి సిద్ధాంతమే అంగీకార యోగ్యమని తేచి దాని ననుసరించితిమి. కృతయుగాది నుండి సప్తర్షిమండల చలనమును జూపెడి లెక్క ముందు గ్రంథమున జూపబడినది.

సప్తర్షిమండల మొకనక్షత్రమునుండి వేరొకనక్షత్రము జేరుటకు నూరు సంవత్సరములు పట్టునట్లు చెప్పబడినది. రెండునక్షత్రముల దూరము 13 డిగ్రీలు యిరువది లిప్తలు. డిగ్రీ 1కి అరువదిలిప్తల చొ॥ 800 లిప్తలగును. సం॥ రమునకు యెనిమిది లిప్తలు చొ॥ నూరు సం॥ రముల కొక నక్షత్రమును దాటుచు 27 నక్షత్రములుగ చక్రము నంతను చుట్టుటకు 2700 సం॥ రములు పట్టునట్లు చెప్పబడినది.

కృతయుగాదియందు క్రతువు శ్రవణం ౧ వ పాదమందును, పులహుడు శ్రవణం ౨ వ పాదమందును, పులస్త్యుడు ధనిష్ట ౨ వ పాదమందును, అత్రి ధనిష్ట 3 వ పాదమందును, అంగిరసుడు శతభిషం ౨ వ పాదమందును వసిష్ఠుడు పూ॥ భా॥ ౧ వ పాదమందును మరీచి ఉత్తరాభాద్రా ప్రథమ పాదమందును వున్నటుల పైశ్లోకములలో బ్రహ్మసిద్ధాంతమున జెప్పబడినది.

౧. కృతయుగాదియందు శ్రవణం ప్రథమపాదమునుండి బయలుదేరిన సప్తర్షిమండలము సవ్యముగా చక్రము నొక్కసారి చుట్టుటకు 2700 సం॥ రముల చొ॥ పట్టిన కృతయుగాది ద్వాపరాంతంవరకు గల కాలము 38,88,000 సం॥ రములలో 1440 ఆవృత్తులు చుట్టి కలియుగ ప్రారంభమునకు తిరిగి శ్రవణమునకు వచ్చియుండవలెను, అట్లుగాక శ్రవణమునుదాటి దానికి 16 వ నక్షత్రమైన మఖలో మూడుపాద

ములవరకు ($15\frac{3}{4}$ నక్షత్రములు) వెళ్ళియున్నటుల పురాణములును, జ్యోతిశ్శాస్త్ర గ్రంథములును, జెప్పుచున్నవి.

౨. కొందరి మతముప్రకారము సప్తఋషి మండలము అపసవ్యముగా (Retrograde motion) తిరుగున్నటుల యెంచినను ద్వాపరాంతముకు తిరిగి శ్రవణము ప్రథమ పాదముకే వచ్చియుండవలెను. ఎట్లన కృతయుగాది ద్వాపరాంతమువరకుగల కాలము 38,88,000 సం॥లను 2700 తో హెచ్చించగా 1448/27=1440 చుట్లు తిరిగి అపసవ్యనడకప్రకారం శ్రవణముకు పదమూడవ నక్షత్రమైన మఖ మూడవ పాదము గడచినది అనగా $12\frac{3}{4}$ నక్షత్రములు దాటినది. ఈ వాదము ప్రకారము జూచినను సప్తర్షి మండలముయొక్క గమనము కృతయుగాదిని చెప్పబడినట్లు సం॥ రం 1కి యెనిమిది లిప్తల చొ॥ ఒక నక్షత్ర దూరమును నూరు సంవత్సరములకును, చక్రమును 2700 సం॥లును ఖచితముగా తిరుగుచున్నట్లు గనుపడదు. దాని గమనములో వేగమెచ్చినందున కలియుగమునుండి చక్రమును చుట్టుకాలము 2700 నుండి 2527 సంవత్సరములు కాలమునకు తగ్గినట్లు యొప్పుకొనక తప్పదు. (రెండు మతముల వారి లెక్క ప్రకారం తేడా మూడు నక్షత్రముల దూరముగా నున్నది) సవ్యముగాగాని లేక అపసవ్యముగాగాని తిరుగుచున్నటుల చెప్పినను రెండు మతముల ప్రకారము కలిప్రారంభమున సప్తర్షులు మఖలో మూడుపాదములు గడచినవి.

మొదటి వాదము ప్రకారము సవ్యముగా నక్షత్ర చక్రము నొక్కమారు చుట్టుటకు యిప్పుడు 2527సం॥ రములు మాత్రమే పట్టుచున్నట్లు లెక్కప్రకారము కనుబడుచున్నది. ఎందువలన ననగా కృతయుగాదియందు సంవత్సరమున కెనిమిది లిప్తలు చొ॥ గతిగలిగియుండి క్రమక్రమముగా దానిగతిలో వేగమెచ్చినందున యిప్పుడు సం॥రమునకు 8 లిప్తల 32 4/5 విలిప్తలుగతి గలిగియున్నటుల తెలియుచున్నది కలియుగాదియందు మఖ యందున్నటుల విష్ణు పురాణాదులును, "బృహత్సంహిత" యను సిద్ధాంతగ్రంథమునను స్పష్టముగా చెప్పు

బడియున్నది. ఇప్పుడా శాకమందు జూడగా పూర్వఫల్గునీని (పుబ్బ) సమీపించుచున్నది. అనగా కలియుగాదనుండి జరిగిన **5044** సం॥ వత్సరములలో **54** నక్షత్రములు జరిగి యేబదియైదవ నక్షత్రము జేరుచున్నది. గనుక **5044** సం॥ ముందు జరిగిన యుధిష్ఠిరుని కాలమునను మఖలోనికి వచ్చినట్లు పురాణములు జెప్పుచున్నవి. ఆప్రకారము లెఖ చూడగా ఒకనక్షత్రమునుండి వేరొక నక్షత్రమును జేరుటకిప్పుడు 93 16/27 సం॥రములు పట్టుచున్నట్లు కనుపడుచున్నది. రెండునక్షత్రముల మధ్యదూరము 800 లిప్తలును 93 16/27 చే హరించగా 8-32¾ లిప్తలు వచ్చును. గనుక సప్తర్షిమండల మిప్పుడు యెనిమిది లిప్తల ముప్పది రెండు పైచిలుకు విలిప్తలుచొ॥ సంవత్సరములో గతిగలిగి యున్నటుల తెలియుచున్నది. ఒక నక్షత్రదూరమును లెక్కించునపుడు 93 సం॥ యేడుమాసముల మూడు రోజులు యిరువది ఘడియల చొ॥నను యిరువదియేడు నక్షత్రముల చక్రమునంతను చుట్టిన కాలము లెక్కించునపుడు ఆవర్తి 1కి 2527 సం॥రములచొ॥నను చూడవలసి యున్నట్లు లెఖ ప్రకారం కనుబడుచున్నది. కృతయుగాదినుండి కలియుగాదివరకు లెఖచూడగా కృత 17,28,000 + త్రేత 12,96,000 + ద్వాపర 8,54,000 వెరసి 38,88,000 సంవత్సరములు కృతయుగాదియందు సప్తఋషులలో క్రతువునుబట్టి లెఖచూడగా శ్రవణనక్షత్రమందున్నాడు. కలియుగాదియందు మఖలోనికి వచ్చియున్నట్లు చెప్పబడిన ప్రమాణ వాక్యములు గలవు. సగటున ఆవర్తి 1కి 2527 సం॥రములు చొ॥ తిరిగినట్లు తలచి పైమూడుయుగముల కాలమును 2527 చే హరించగా వచ్చిన లబ్ధము 1538 ఆవృత్తులు పూర్తిచేసుకొని 1539వ, ఆవర్తిలో 1474 సం॥రములకు శ్రవణమును 16 పదహారవ నక్షత్రమైన మఖలోనికి వచ్చి మూడుపాదములు జరిగియుండెను. ఆ కాలమున యుధిష్ఠిరుడు రాజ్యము చేయుచుండెను. ధర్మజుని రాజ్యకాలము 36 సం॥రములు. ఆపిమ్మట సప్తఋషులు మఖయందుండగనే కలియుగము ప్రారంభమైనది. కలియుగ ప్రారంభ కాలము ప్రమాధినామ సంవత్సర చైత్ర శు ౧ శుక్రవారం కృతయుగాదినుండి కలియుగాదికి

తిరుగుటలో క్రమక్రమముగా గతివేగము హెచ్చినందున ఒకనక్షత్రమునుండి వేరొకనక్షత్రమును జేరుటకు నగటున 93 16/27 సంవత్సరములు పట్టినట్లు లెఖ్ఖప్రకారము గనుబడుచున్నది. కలియుగాదినుండి కూడ 93 16/27 సం॥రములు మాత్రమే పట్టుచున్నట్లు లెఖ్ఖ చూడవలసియున్నది. కృతయుగాదినుండి సప్తఋషి మండలముయొక్క గతిలో వేగము క్రమక్రమముగా హెచ్చుచురాగా కలియుగాదికి వచ్చుసరికి సంవత్సరములో యెనిమిది లిప్తల ముప్పదిరెండు పైచిలుకు విలి॥ గతిచొ॥ దానినడక యేర్పడినదని గ్రహింపవలెను.

| | |
|---|---|
| ఈ వాదముప్రకారం 2527 సం॥ వరకు ఆవర్తి తిరుగుటకైన యెడల ఒకనక్షత్ర దూరము తిరుగుటకు 93 సం॥ 7 నె. 3రో 20 ఘడియలు అగును కలియుగాదిన మఖ నాలుగవ పాద ప్రారంభమున నున్నది. దానిని పూర్తి చేయుటకు పట్టినకాలము— | సం॥--నె--రో--ఘ<br>23—4--23--20 |
| పిమ్మట పూర్వఫల్గుని ల॥ తిరిగి పూ॥ ఫ ప్రారంభమునకు 1 ఆవర్తికి— | 2527—0--0—0 |
| రెండవ ఆవర్తిలో పూ॥ ఫ॥ లగాయతు మఖ ప్రారంభమునకు గడచిన 26 నక్షత్రములకు— | 2433—4--26--40 |
| మఖలో యిప్పుడు గడచిన సం॥ రములు— | 60—2--10--00 |
| (యిప్పుడు పూ॥ ఫల్గునిని సమీపించుచున్నది. వెరశి— | 5044—0--0—0లు |

ప్రస్తుత కాలమునకు కొంచె మెంచుమించుగా సరిపోవుచున్నది. స్వల్ప తేడాయుండిన యుపేక్షింపదగినది.

ఇంకను రెండవ వాదము:— సప్తర్షి మండలము అపసవ్యముగా తిరుగుచు కలి ప్రారంభమున మఖ మూడవ పాదము దాటిన

దనియు, కలి 5044 సం॥ రమునకు వచ్చి (20) యిరువది సంవత్సరము లైనదనియు చెప్పుచున్నారు. కృతయుగాదినుండియు ద్వాపరాంతమునకు అపసవ్యముగా ఆవర్తి 1కి 2519 సం॥ చొ॥ తిరుగుచు 1543 ఆవర్తులు పూర్తిచేసి తిరిగి శ్ర[illegible]మునకోనికే వచ్చినవనియు పిమ్మట 1544వ ఆవర్తిలో 1183 సం॥ రములు తిరుగగా మఖ మూడవ పాదము దాటినదనియు చెప్పబడినది. అనగా 12 3/4 నక్షత్రముల దూరము 1183 సం॥రములలో తిరిగియున్నది ఈ ప్రకారం వక నక్షత్రం దూరము తిరుగుటకు సం॥ 93 నె॥ 3 రో॥ 16 ఘ॥ 40 కాలము పట్టినది. అనగా స॥ 1కి 8 లిప్తల 37 విలిప్తలును నడుచుచున్నది.

| | |
|---|---|
| పై లెక్క ప్రకారం కలియుగాదిని మఖ నాల్గవపాదమును దాటుటకు — | 23—3—26—40 |
| (అపసవ్య నడకను) ఆశ్లేషములో మొదటి ఆవర్తిలో తిరుగుటకు — | 2519—0—00—00 |
| రెండవ ఆవర్తిలో ఆశ్లేషనుండి హస్తానక్షత్రమునకు మధ్య 23 నక్షత్రములు నడచుటకు— | 2145—9—23—20 |
| హస్తలో జరిగినకాలము— | 20—0—10—0 |
| వెరశి | 4708—2—0—0 |

కలి 5044—4708 1/6=335 5/6 సం॥ రములు తక్కువగుచున్నది. ఈ లెక్క ప్రకారం పెద్దవ్యత్యాసము గల్గియున్నందున యీ వాద మంగీకరింపదగినదిగాదు సప్తర్షిమండలము చక్రమునంతయు చుట్టుటకు యిప్పటికికూడా 2700 సం॥రము లగుచున్నదని వారు నమ్ముచుండుట వలననే యీ గొప్ప పొరబాటునకు కారణమైనది. దాని నడకలో భేదము కలిగినదని తెలిసికొనినగాని వీరి భ్రాంతి వదలనేరదు.

3. సప్తర్షులు అపసవ్యముగా తిరుగుచున్నారని చెప్పెడి మూడవ మతమువారు గలరు వీరు కలియుగాదియందు సప్తర్షులు కృత్తికా

నక్షత్రమునందున్నట్లు చెప్పుచున్నారు. వీరి వాదము ప్రకారం కృతయుగాదియందు శ్రవణ నక్షత్రమునుండి బయలుదేరిన సప్తర్షిమండలము ఆవర్తి 1కి 2700 సం॥ రముల చొ॥ ద్వాపరాంతము వరకు కాలము 38,88,000 సం॥ రములలో 1440 ఆవర్తులు తిరిగి శ్రవణమునకు వచ్చియుండవలసినది. అట్లుగాక శ్రవణాదాటి 19 నక్షత్రముల పైచిల్లర దూరము నడిచి కృత్తికానక్షత్రమును చేరియున్నది. అట్లు చేరుటకు 1900 సం॥ రములు పైచిలుకు కాలము హెచ్చుగా పట్టియుండవలసినది కాని అట్లుగాక 38,88,000 సం॥ర కాలములోనే ఆవర్తులు పూర్తిచేసుకొని యింకను హెచ్చుదూరము (19 నక్షత్రముల పైచిల్లరదూరము) నడచుటవలన సప్తర్షి మండలమునకు గమనవేగము పెరిగినదనియు, అందువలన ఆవర్తికి 2700 సం॥రములు చొ॥ తిరుగక యింకను తక్కువ కాలముననే (250 సం॥ రములలోనే) ఆవర్తిని పూర్తి చేయుచున్నట్లు స్పష్టముగా తెలియుచున్నది. ఆవర్తి 1కి 2504 సం॥ రముల చొ॥ తిరిగిన ఒక

| | సం॥ నె॥ రో॥ ఘ॥ | |
|---|---|---|
| నక్షత్రదూరము తిరుగుటకు— | 92- 8- 26- 40 | పట్టును. |
| పందొమ్మిది(19) నక్షత్రముల దూరము తిరుగుటకు | 1762- 0- 26- 40 | పట్టినది. |
| 38,88000 సం॥రములలో ఆవర్తి 1కి 2504 సం॥ ల చొ॥ తిరిగి రాగా 1552 ఆవర్తులు తిరిగినమీదట 1553 అవర్తిలో జరిగిన 1792 సంవత్సరములలో 19 నక్షత్రములు తిరిగి 20వ నక్షత్రములో నడచిన కాలము | 29- 11- 3- 20 | |
| వెరశి— | 1792-0-0 40 | లలో |

శ్రవణంనుండి బయలుదేరి అపసవ్యనడకను కృత్తికలోకి వచ్చినట్లు తెలియుచున్నది. అనగా సం॥ 1కి 8 లిప్తల 37 $\frac{2}{3}$ విలిప్తల చొ॥ నడచినట్లు లెఖ్ఖ ప్రకారము వచ్చుచున్నది, సవ్యముగాగాని లేక అపసవ్యముగాగాని యెటు తిరిగినటులెంచినను సప్తర్షుల గమనము కృతయుగాది లెఖ్ఖప్రకారము లేదనియు, కలియుగాదికి వచ్చునరికి

సవ్యముగా తిరుగుచున్న లెక్కించిన సం॥రమునకు 8-32 $\frac{4}{5}$ లిప్తల చొ॥నను అపసవ్యముగా తిరుగుచున్న లెక్కించిన సం॥రమునకు 8-37 $\frac{2}{3}$ లిప్తల చొ॥ తిరుగుచుండిరని గుర్తించవలసియున్నది. సం॥ రమునకు 8 లిప్తల చొ॥ నను నూరు సం॥ రములలో యొక నక్షత్రదూరము నడచుటయు 2700 సం॥ లలో చక్రమంతయు తిరిగి వచ్చుటయు యుగాంత విషయములుగాని కలియుగ విషయములు కావు.

అపసవ్యముగా తిరుగుచు కలియుగాదిని కృత్తికలో యున్నవను వారి వాదప్రకారము కలి 5044 సం॥ రమునాటికి 1 ఆవర్తి తిరిగి పైన 24 నక్షత్రములు గడచి 25 వ నక్షత్రమైన ఆర్ద్రకు వచ్చి 20 సం॥ రములు గడచినది.

| | సం--నె--రో--ఘ |
|---|---|
| 1 ఆవర్తి తిరుగుటకు కాలము— | 2504-0--0--0 |
| 24 నక్షత్రములు తిరిగిన కాలము— | 2225-9---10--0 |
| 25 వ నక్షత్రమైన ఆర్ద్రలో జరిగిన కాలము— | 20-0—0---0 |
| కలియుగాదినుండి తిరిగిన కాలము— వెరశి | 4749-9--10--0 |

కలిలో యిప్పటికి గడచిన కాలము 5044 లో నుండి 4749-9-10-0 సం॥ రము తీసివేయగా సం॥ 294-2-20 రోజులు తక్కువ వచ్చుచున్నది. ఈలెక్క ప్రకారము సరిపోవడములేదు. అట్లుగాక మూడవ వాదము ననుసరించిజూచిన సప్తఋషి మండలము కృతయుగాదియందు స్వాతీ నక్షత్రమందున్నటుల అపసవ్యనడకతో కలియుగాదికి కృత్తికానక్షత్రమును చేరినట్లును యెంచవలసియున్నది. ఆప్రకారము లెక్కచూచిన 38 88,000 సం॥ రములలో భగణము 1కి 2700 సం॥ రముల చొ॥ తిరిగిన ద్వాపరాంతమునకు తిరిగి స్వాతికి వచ్చియుండవలసినది. అట్లుగాక కృత్తికా నక్షత్రమునకు వచ్చియున్నట్లు ఆ వాదమునందు చెప్పబడినది. స్వాతినుండి వెనుకకు లెక్కించిన కృత్తిక పదమూడవ నక్షత్రముగుటవలన 12 3/4 నక్షత్రములు యెక్కువ నడచినటుల గనపడుచున్నది. ఆ ప్రకారం లెక్కజూచిన రెండవ

మతమువారి లెక్కవలెనే సం॥ రంకు 8 లిప్తల 37 విలిప్తలు చొ॥ నడచుచు 2519 సం॥ రములలో ఒక భగణము చేయుచున్నట్లు గను పడుచున్నది. పర్యవసానములో కలిలో తిరిగిన 5044 సం॥ రములలో 335 5/6 సం॥ రములు తగ్గిపోవుచున్నందున యిదియు నంగీకరింప తగి నది కాదు. దీనినిబట్టి బ్రహ్మసిద్ధాంతమందు చెప్పబడినటుల కృత యుగాదియందు శ్రవణమందుండుటయు, సవ్యమైన నడకతో కలి యుగాదికి మఖ మూడవపాదము దాటుటయు సమంజసముగా గను బడుచున్నది. గమనవేగము హెచ్చుట గమనింపదగినది.

ఈ విషయములో—

శ్రీ విద్యాశంకర పదమావేశ ప్రకాశిత జగద్గురు శ్రీ కల్యాణా నంద భారతీ మాంతాచార్య స్వాములవారిచే వ్రాయబడిన "సప్తర్షి మండలము-పూర్వఫల్గుని" కలి 5032 క్రీ॥ శ. 5 డిశంబరు 1930 అను కరపత్రమున యీ విధముగా వ్రాసియున్నారు.

"సప్తర్షి మండలమున్ను ధ్రువనక్షత్రము చుట్టును దిరుగు చున్నటుల జూడబడుచున్నది. ఈ మండలమున నాలుగు నక్షత్ర ములు మంచపుకోళ్ళవలె నుండి మూడునక్షత్రములొక తోకవలె నుండుటచే పాశ్చాత్యులు దీనిని పెద్దయెలుగు (Great Bear) అని పిలువసాగిరి. భారతవర్షీయులున్నో కశ్యపాది సప్తర్షులు, నిలయము లనియు, నద్దానిచే సప్తర్షిమండలమని బిలచుచున్నారు. సప్తర్షు న, భారతభూమియందలి ద్విజులకు మూలపురుషులని మహర్షుల సాంప్ర దాయ విదులు గుర్తెరింగి యున్నారలు ఈఋషులు బ్రహ్మ విద్యా సాంప్రదాయ ప్రవర్తకులుగావున నట్టి బ్రహ్మవిద్యకుదగు కర్మయోగ ప్రారంభకాలమగు వివాహకాలమున, నాఋషుల దర్శించుట వారి యొక్క సన్మార్గమునననుసరించి, వారలవలె శాశ్వత పదవుంబొంద నిచ్ఛజనింప తద్దర్శనము పవిత్రముగా దలంపబడుచున్నది. మంచము కోళ్ళవలెనుండు నాలుగింటిలో మొదట నుదయించు రెండు నక్షత్ర ములును ధ్రువనక్షత్రములో నొక త్రిజ్య (radius) వలె నుండును,

అట్లుండి తిరుగుచుండుటచే, నీ మండలముగూడ ధ్రువనక్షత్ర మట్లు చలనరహితమని. కొలదిలోజుల క్రిందటవఱకును బాశ్చాత్యులచే దలంపబడుచుండెడిది. భారతవర్షీయులన్ననో యీ మండలమునకు గతికలదని తెలిసికొనుటచేతనే దీనిని ఋషిమండలమనిరి. "ఋషి గతౌ" అను ధాతువువలన గలిగిన "ఋషి" యనుశబ్దము "గతి కలదను నర్థమును స్ఫురింపజేయుచున్నది. ఋషులన గతి (చలనము) గలవారని యర్థము ఈ మండలపు గతి యతిసూక్ష్మ మగుటచే బాహ్యమునకు సుకరముగ దెలియబడని రహస్య మీ ఋషి నామముచే వ్యక్తీకరింపబడుచున్నది. ఈమండలపు గతిని గమనించుటకు గల విధానము పరాశర మహర్షిచే విష్ణుపురాణమున నిట్లు వర్ణింపబడియున్నది.

"సప్తర్షీణాంతు యౌపూర్వౌ దృశ్యేతేహ్యుదితౌ దివి।
తయోస్తు మధ్యే నక్షత్రం దృశ్యతే యత్సమం నిశి॥
తేన సప్తర్షయో యుక్తా స్తిష్ఠంత్యబ్దశతం నృణాం"

సప్తర్షులలో నాకాశమునందు మొట్టమొదట రెండు నక్షత్రములుదయింపుచు జూడబడుచున్నవి. ఆ రెంటియొక్క మధ్యమునుండి యే నక్షత్రము నిశి యందు సమముగా జూడబడునో యా నక్షత్రమునందు ఋషు లొక మానుషశతాబ్దము నిలిచియుందురు. ఆ పైన రెండు నక్షత్రములను గలుపు సరళరేఖయొక్క మధ్యబిందువశ్విన్యాది నక్షత్రములలోని యేనక్షత్రములో గగనమధ్యమందు సమానరేఖయందుండునో యా నక్షత్రమునందొక మానుష శతాబ్ద ముండుననియు సామాన్యముగ వర్ణింపబడి యున్నది.

ప్రకృతపుస్థితి:- ప్రస్తుతమున క్రీస్తువెనుక 1930 వ సం॥ డిశంబరు 5 తేదీ శుక్రవారమునకు సరియైన ప్రమోదూత సం॥ ర మార్గశిర శుక్లపూర్ణిమ దివసమందు సప్తర్షి మండలము పూర్వఫల్గునీ (పుబ్బ) నక్షత్రమందు బాహుళ్యముగ ప్రవేశించియున్నట్లు ఒక్క గగనమధ్య)మున నగపడుచున్నయది. ఇతఃపూర్వ మించుమించుగ ఒక శతాబ్దము

నుండియు, మఖా నక్షత్రమునందుండినట్లు శిష్టాచార ప్రతీతి సుప్రసిద్ధముగ దెలియవచ్చుచునేయున్నది. అంతియకాదు, మఘా నక్షత్రమునకును పూర్వఫల్గునీ నక్షత్రమునకును నుండు ప్రదేశములో మూడు భాగములలో రెండు భాగములే పైనుండియు పూర్వఫల్గునీ నక్షత్రమువఱకును సప్తర్షిమండలము నడచుటను మేము (శ్రీ కల్యాణానంద భారతీస్వాములవారు) బాగుగా శోధించియున్నారము. ఇట్టి శోధనయందు సప్తర్షిమండలము మఘా నక్షత్రమునుండి పూర్వఫల్గునీ నక్షత్రమునకు బుష్కలముగ జరుగుట దృగ్గోచరమైనది. దానంజేసి సప్తర్షిమండలము గమనము లేక నిశ్చలముగ నున్నదను పాశ్చాత్యవాదమును, యీ మండల మితరగ్రహములట్లుగాక రాహుకేతువులట్లు వెనుకకు (అనగా) మఖనుండి ఆశ్లేషకు, నాశ్లేషనుండి పుష్యమికి నీ తీరున నడచుచున్నదను కువాదమును, నంధప్రలాపములట్లు వారింపబడుచున్నవి.’’

సప్తర్షిమండల మొక్కొక్క నక్షత్రమున నూరు మానుష సంవత్సరము లుండునని చెప్పుటచే 27 నక్షత్రములుగల నక్షత్ర చక్రమును నొక్కమారు చుట్టుటకు 2700 మానుష సం॥ రములు పట్టును.

‘‘సప్తర్షిమండలము మఘనుండి మఘకు రెండుపర్యాయములు చుట్టి పుబ్బకు వచ్చినట్లును పుబ్బనుండి పుబ్బకు రెండుపర్యాయములు చుట్టివచ్చినట్లును, నిశ్చయము చేసితీరవలయును. ఏలయన గల్యాది గడచి, నేటికి 5032 సం॥ రములు సుమారుగ నైనట్లు సర్వవిధముల దెలిసియేయున్నది, పైన జెప్పబడిన విధముగ సప్తర్షి మండలము గల్యాదినుండి యేబదియైదు (55) నక్షత్రముల ప్రదేశము సంచరించినట్లు సుస్పష్టమగుచునేయున్నది. 55 నక్షత్రములను జరించుటకు 5500 సం॥ రములు పట్టితీరవలయును. గ్రహగతుల శోధనచే గల్యాది 5032 సం॥ లకు బూర్వమని తెలియవచ్చెడివి. ఇందు 5500-5032=468 సం॥ రములు వ్యత్యాసము గన్పట్టుచున్నయది. ఇట్టి వ్యత్యాసమునకు

గల కారణము నొకింత తెలియనిది భగణ వ్యవస్థచేయుట యుక్తి యుక్తము కాదు."

## సంవత్సర భేదములు

"జ్యోతిశ్శాస్త్రమువలన సం॥ రమందు పరిమాణ మానమును గూర్చి వ్యవస్థాభేదములు గానవచ్చుట గణకునికొక వింతకాదు, అదెట్లులన గాల పరిణామమును లెక్కించుటలో దిన ప్రమాణము నాధారముగ జేసుకొని, మాసాది ప్రమాణముల నొక్కొక్క వ్యవస్థచే గ్రహింపుచున్నారలు. సూర్యోదయాది సూర్యోదయ పర్యంత మొకదినముగను నట్టిదినములు ముప్పదియైన యొక మాసముగను గ్రహించుట సార్వత్రికము. దీనిని సావనమాస మందురు. అరువది గడియల కాలము దివసమనియు నట్టి దివసములు ముప్పదియైనచో నొక మాసమనియు, నయ్యది నాక్షత్ర మాసమనియును జెప్పబడు చున్నయది. చంద్ర తిథులచే చాంద్రమాసమును అన అమావాస్య మొదలు అమావాస్యవరకును లేక పూర్ణిమ మొదలు పూర్ణిమ వరకును జాంద్రమానము లెక్కింప బడుచున్నయది. ఇట్టి మాసమునకు సామాన్య దృష్టిచే $29\frac{1}{2}$ దినములచిల్లర పరిమాణము తేలుచున్నది. ఇక సంక్రాంతిగణనచే సౌరమాసము లెక్కింపబడుచున్నది. ఇట్టి మాసమునకు సామాన్యదృష్టిచే 30 దివసముల పదిన్నర గంటల కాలము తేలుచున్నది. ఇట్టి మానసాంకేతములుండ చంద్రుడొక నక్షత్రమునుండి బయలువెడలి మరల యా నక్షత్రమునకు వచ్చు కాలము లౌకికమాసమని చెప్పబడుచున్నది. ఇట్టి మాసమునకు సుమారు $27\frac{1}{3}$ దివసముల కాలము పట్టుచున్నది. ఇట్టి మాసము విశేషజ్ఞాన మక్కర లేకుండ కేవల నక్షత్ర సాంకేతనముచేతనే లెక్కింపబడుచున్నది. ఏ మాసపు పరిమితి యెట్టుల జరుగుచున్నను సంవత్సరమునకు బంన్రెండు మాసములను వ్యవహారము సుప్రసిద్ధముగ దెలియవచ్చెడిని. సం॥ రమునకు మాసములు పంన్రెండైనను, మాసమునకు దినములు భేదించుటచే సం॥ రమునందుగూడ భేదము

దెలియవచ్చెడిని. ఇట్లు సంవత్సరము 1 నాక్షత్రము 2 సావనము 3 చాంద్రము 4 సౌరము 5 లౌకికమని యైదు తెఱంగుల దెలియ వచ్చెడిని. ఇందు మొకటి నాలుగు సంవత్సరంబులకును గారణంబగు మాసము కించిన్న్యూనాతిరేకముల యుపేక్షచే ముప్పది దివసముల పరిమితి గలదిగా యోచింపబడుటచే నట్టి సం॥ రము 360 దివసము లతో నొప్పునట్లు సర్వసాధారణముగ దలంచబడి, జ్యోతిశ్శాస్త్ర వ్యవహారమంతయు నరిపెట్టబడుచున్నయది. లౌకికాబ్దమన్ననో యట్లు గాక 27 1/2 × 12=330 దినములతో నొప్పుచున్నయది. ప్రకృత మున కల్యాదినుండి లెక్కింపబడు 5032 సం॥ రములు 360 దినముల పరిమితిగల్గిన వత్సరములుగ బరిగణింపబడుట యెల్లరకును దెలిసినవిష యమే. కావున పరాశరోక్తివలన దెలియవచ్చెడి "అబ్దశతంనృణాం" (నృణామబ్దశతం) అను స్థలమందలి "నృణా" అను విశేషముచే సర్వ జనులకు లౌకికదృష్టిచే దెలియబడు లౌకికాబ్దములని గ్రహింపవలసి యున్నది. అట్లు గ్రహించుటయే ప్రకృతము నసంజసముగా నొప్పు చున్నయది. ఎట్లన:- ప్రకృతసంవత్సరము 360 దినములు. గావున లౌకికాబ్దము 330/360=11/12 వ, సామాన్య సంవత్సరమునకు సరి పోవును. ఇక 5500 వత్సరమున్ననో 5500 × 11/12=5041 2/3 వ్యవ హారిక సం॥ రములకు సరిపోవుచున్నవి. ప్రకృతము కలియందు భుక్తి నొందిన వత్సరములు 5031 2/3 యని సుప్రసిద్ధమేగద. దీనింబట్టి సప్తర్షి మండలము కలి ప్రారంభమునకు బది సం॥ రములుపూర్వము అన ద్వాపరాంతమున శుక్ల సం॥ర చైత్ర శుద్ధ ప్రతిపత్తునాడు మఘా నక్షత్రమున జేరియుండవచ్చునని నిశ్చయము జేయనగును. దానం జేసి పరాశరు లుద్దేశించిన నూరుసంవత్సరములు లౌకికాబ్దములనియు నవ్వాని జ్యోతిశ్శాస్త్రదృష్టితో జూచిన నవ్వి 100 × 11/12= 91 2/3 సం॥ రములు మాత్రమే యగుచున్నవనియు దానంజేసి సప్తర్షి మండల మొక భాగమునకు 91 2/3 × 27=2475 సం॥ రముల కాలము నపేక్షింపుచున్నదనియు, దెలియవచ్చెడిని... ... ... ... ...

... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ...

అశ్విన్యాదులగు దృగ్గోచర నక్షత్రములకు గౌణముగా దలంచుచు భావ గోచరంబులను 360° ÷ 27 = 13 1/3 అంశలు (Degrees) చొ॥ లెక్కించినచో అశ్విన్యాది రేవత్యంతము ప్రతి నక్షత్రమందును 91 2/3 సం॥ రములుగాని శత (నూరు) 100 లౌకికాబ్దములు గాని సప్తర్షులుందురని నిశ్చయముగ జెప్పనగును..................ఆకాశమందు నక్షత్రములన్నియు సమాన దూరమున నుండక భేదవిశేషములతో నొప్పుచున్నయవి. దానంజేసి యే యే నక్షత్రమునందెంతెంతకాలమునకు సంబంధించునో యట్టి యంశవిభాగంబుచే నిరూపింపబడుచున్నది. ఇచట నక్షత్రములకు సప్తర్షిమండలములోడి సంబంధమును విచారించుటకు సప్తర్షిమండలమునకు ధ్రువనక్షత్రముతో నత్యద్భుత సంబంధముంటచే ధ్రువనక్షత్ర Polar longitude యందలి దూర విశేషములను గ్రహించి వ్యవస్థ చేయబడుచున్నది. దృగ్గోచరముగు నక్షత్రములకు సంబంధించి గమనించినచో నిందుదాహరింపబడిన కాలమునే గ్రహించవలయును. జ్యోతిశ్శాస్త్రమున నక్షత్ర ప్రమాణము 800 కళలు గ్రహింపబడుచున్నది. సప్తర్షిమండలము 300 కళలను జరించుటకు 91 2/3 సం॥రములు పట్టును. ఒక కళను జరించుటకు 11/96 సం॥ రము అనగా 1 నెల $11\frac{1}{4}$ దినములు పట్టును. ఈ దిగువ పట్టికయందు దృగ్గోచర నక్షత్రములుండు స్థానములు, వానికి నడుమనుండు వ్యత్యాసము ఒక్కొక్క నక్షత్రమునుండి మరియొకదానికి బోవుటకు గల కాలము, యే యే నక్షత్రమునకు ముందే యే వత్సరమున ప్రవేశకాలము నొందునో యదియు ప్రాజ్ఞుల యోజన కొరకు నిరూపింపబడుచున్నది. ఇట్లు గమనించుటలో ప్రకృతము దృగ్గోచరముగు పూర్వఫల్గునీ నక్షత్రమునుండి వ్యవస్థ చేయబడుచున్నది. సప్తర్షిమండల దర్శనము విధింపబడుటచే దృగ్గోచర ప్రాధాన్యముగ నిందలి కాలము నిరూపింపబడుచున్నది. భావగోచర విషయమును గణకులు దీనినుండి సుకరముగ దెలిసికొనగలరు.''

| సంఖ్య. | నక్షత్రముపేరు. | ధ్రువనక్షత్రం అంశ—కళ. | వ్యత్యాసం కళలు. | సంవత్సరములు |
|---|---|---|---|---|
| 1. | పూర్వఫల్గునీ | 144--0 | ... | ... |
| 2. | ఉత్తరఫల్గునీ | 155--0 | 600 | 76 |
| 3. | హస్తా | 170--0 | 900 | 104 |
| 4. | చిత్తా | 180--0 | 600 | 69 |
| 5. | స్వాతీ | 199--0 | 1140 | 131 |
| 6. | విశాఖా | 213--0 | 840 | 97 |
| 7. | అనూరాధా | 224--0 | 660 | 76 |
| 8. | జ్యేష్ఠా | 229--0 | 300 | 38 |
| 9. | మూలా | 241--0 | 720 | 83 |
| 10. | పూర్వాషాఢ | 254--0 | 780 | 90 |
| 11. | ఉత్తరాషాఢ | 260--0 | 360 | 42 |
| 12. | శ్రవణం | 280--0 | 1200 | 188 |
| 13. | ధనిష్ఠా | 290--0 | 600 | 69 |
| 14. | శతభిషం | 320--0 | 1800 | 207 |
| 15. | పూర్వాభాద్ర | 326--0 | 860 | 42 |
| 16. | ఉత్తరాభాద్ర | 327--0 | 360 | 76 |
| 17. | రేవతీ | 359-50 | 1370 | 157 |
| 18. | అశ్వనీ | 8--0 | 490 | 57 |
| 19. | భరణీ | 20--0 | 720 | 83 |
| 20. | కృత్తిక | 37--30 | 1050 | 121 |
| 21. | రోహిణి | 49--30 | 720 | 83 |
| 22. | మృగశీర్షా | 63--0 | 810 | 93 |
| 23. | ఆరుద్ర | 67--20 | 260 | 30 |
| 24. | పునర్వసు | 93--0 | 1540 | 177 |
| 25. | పుష్యమి | 106-0 | 780 | 90 |
| 26. | ఆశ్లేష | 109-0 | 180 | 21 |
| 27. | మఘా | 29--0 | 1200 | 138 |
| | | | 900 | 104 |

## ప్రవేశకాలము

కలిశకము 5032 ప్రకృతమున మార్గశీర్షపూర్ణిమా శుక్రవారం. క్రీ॥శ. 1930 సం॥ ది 5వ డిశంబరు.

ఇటుపైని యే యే నక్షత్రమునం దెప్పుడెప్పుడు ప్రవేశించినది మధ్యకాల వత్సరంబుల క్రమముగా గల్పికొనిన సుకరముగ గ్రహింప వచ్చును. ఇందు గొంచెము న్యూనాతిరేకములు బడయువచ్చును అవ్వానిని భావికాలదర్శులు గమనించి, సంతసింపుదురుగాక!''

అని వ్రాసియుండిరి.

పైన వ్రాయబడిన శ్రీ శ్రీ శ్రీ కల్యాణానంద భారతీస్వాముల వారియభిప్రాయము మనము తప్పక స్వీకరింపవలసిన దే. ''అబ్దశతం నృణాం'' అనుదానికి వారు లౌకికసం॥ ర మనియు అది నెలకు 27 1/2 దినములు చొ॥ 330 దివసముల గలదనియు తెలవిచ్చిరి ఇదియు సమంజసమే. కాని మానుష సం॥ రమని వచ్చిన చోటు లందు సామాన్యముగా సౌర సం॥ రములు తీసుకొనుటయే ఆచా రము. శ్రీ స్వాములవారు శలవిచ్చినటుల లౌకిక సం॥రము తీసుకొను టకును సావకాశము గలదు. వారి శలవుప్రకారమే సప్తర్షిమండలము ఒక భగణము చేయుటకు లౌకికాబ్దములప్రకారము 2700 సం॥లు పట్టును. సౌరాబ్దములుగా మార్చిన 2475 సం॥ రములగును. ఆప్ర కారం తీసికొని చూతము.

కృతయుగాదియందు సప్తర్షిమండలము శ్రవణ నక్షత్రమం దున్నది. కృతయుగములగాయతు ద్వాపరాంతంబు జరిగిన సం॥ రములు 38,88,000 ఇవి సౌరసం॥ రములు (38,88,000 ÷ 2475= 1570 2250/2475) భగణము 1కి 2475 సౌర సం॥ రముల చొ॥ 38,88,000 సౌర సం॥ రములలో 1570 భగణములుచేసి శ్రవణంకు వచ్చి తిరిగి శ్రవణంనుండి జరిగిన 1571 వ భగణములో 24 నక్షత్ర ములు దాటి 25 వ నక్షత్రములో 50 సం॥ రములు నడచినది. అనగా శ్రవణంనుండి యిరవదినాలుగువ నక్షత్రమైన జ్యేష్ఠను

దాటియిరువదియైదవ నక్షత్రమైన మూలా నక్షత్రములో నఖండాటి పుండవలసినది. అలాగాక కలియుగాదికి మఖలో యుండియున్నటుల వా రంగీకరించుచున్నారు. మూలలో శేషం 41 2/3 సం॥ మూల నుండి మఖకు 17 నక్షత్రములు 17 × 91 2/3=1558 1/3 మఖలో 10 సం॥ వెరశి 1610 సం॥ హెచ్చుగా తిరిగినది. ఇందువలన సప్తర్షి మండలముయొక్క నడకలో కృతయుగాదియందుండిన దానికంటె వేగమెచ్చి యున్నటుల (శ్రీ స్వాములవారు శెలవిచ్చిన ప్రకారము చూచినను) స్పష్టపడుచున్నది. భగణము 1కి 2700 సం॥ లైనను, 2475 సం॥ లైనను కృతయుగాదినుండి లెక్కచేసిన గతి వేగమెచ్చి నటుల స్పష్టపడుచున్నది. ఉభయవాదులును కృతయుగాదినుండియు లెఖచూడక కలియుగాది లగాయితు లెఖచూచి యిప్పటికి సరిపుచ్చు కొనజూచియుండిరి. కాని అట్లును లేదా రాకపోవు. "యుగాదే విష్ణు తారాయాం" అని బ్రహ్మ సిద్ధాంతమందు స్పష్టముగా చెప్పి యున్నందున కృతయుగాదియందు శ్రవణమందుండియున్నది. "అసన్ మఖా సుమునయః" అను సిద్ధాంత వాక్యము వలనను "తేతుపారి క్షితే కాలేమఖా స్వాసన్" అను విష్ణుపురాణ వాక్యమువలనను కలియుగాదియందు మఖా నక్షత్రమందుండి యుండుట సిధ్యము, కలి 5032 (క్రీ॥శ. 1930)లో మఖ దాటి పూర్వఫల్గునిలో ప్రవేశించిన ట్లును, తాము ముప్పది సం॥ రములనుండియు పరిశోధించి ప్రవేశ కాలమును ప్రత్యక్షముగాచూచి నిర్ణయించితిమని శ్రీ కల్యాణానంద భారతీస్వాములవారు శెలవిచ్చుచున్నందున దానిని తప్పక అంగీకరింప వలసినదే. ఇటు అంచనాకు ప్రత్యక్షప్రమాణమే. సప్తర్షి మండలము కృతాదియందును, కలి ప్రవేశకాలమందును కలి 5032 సం॥ర ముం దును యుండియున్న యునికిని ప్రాతిపదికగా నుంచుకొని గణితము చేసి చూచిన సప్తర్షిమండలముయొక్క గమన వేగ మెచ్చినటుల స్పష్ట పడుచున్నది. సప్తర్షిమండలముయొక్క గమనము ననుసరించి ఒక భగణము చేయుట కెంతకాలము తీసికొనునో దాని ననుసరించి కాల నిర్ణయము జేయుటయే సమంజసముగా నుండునని తోచుచున్నది.

కృతయుగాదియందు జెప్పబడిన గతి ననుసరించి 2700 సౌర సం॥ రములని యొకరును ఆ సం॥ రముయొక్క పరిమాణములో తేడా యున్నటుల చూపుచు 2700 లౌకిక సం॥ లేక 2475 సౌర సం॥ రములని యొకరును రెండు వాదములు వినబడుచున్నవి. ఏ వాదమును కృతాదినుండియు గణితమువేసి సరిజూచినటుల లేదు. గనుక సప్తర్షి మండలముయొక్క ప్రస్తుత గతి ననుసరించి అది చక్రము నొక్క మారు చుట్టుకాలమును నిర్ణయము చేయుటయే న్యాయముగా నున్నటుల తోచుచున్నది. ఈ విషయము పైన వివరింపబడియున్నది. శ్రీ స్వాములవారు యీ ప్రకరణము ప్రారంభమున సూచించిన మొదటివాదమునే యంగీకరించి గణితమును వేసియుండిరి. కాని వారు సప్తర్షి మండలము మఖానక్షత్రమును దాటి క్రీ. శ. 1930 సం॥ రము కలి 5032 సం॥రమునందే పూర్వఫల్గుణీ (పుబ్బ) నక్షత్రమున ప్రవేశించినదనియు కలి ప్రారంభముకు మఖలో ప్రవేశించి పది సం॥ రములు మాత్రమే యైయుండుననియు చెప్పియున్నారు.

పర్యవసానమేమనగా సప్తర్షి మండలముయొక్క నడకలో వేగమెచ్చినది. సంవత్సరముకు కృతయుగాదియందు నడక 8 లిప్తలు చొ॥ వున్నది. యిప్పుడు నడక 8 లిప్తల 32-4/5 విలిప్తల చొ॥ వున్నది. అందువలన ఒక భగణముచేయుటకు 2527 సం॥రములు మాత్రమే పట్టుచున్నది. అది సవ్యముగానే తిరుగుచున్నది గాని అపసవ్యముగా తిరుగుట లేదు. కృతయుగాదిన శ్రవణనక్షత్రమందుండి యున్నది. కలియుగాదిని మఖలోవుండి యున్నది. ఇప్పుడు పుబ్బ టి పుబ్బలోకి వచ్చియున్నది. (ఇప్పుడనగా కలి 5044 సం॥రములో) ఈ నూను గుర్తులను ప్రాతిపదికగా పెట్టి లెఖవేసి సరిచూచుకోవలసి యున్నది దానినే పైనవిపులముగా చర్చించి స్థిరపరచితిమి.

## సప్తఋషి భ్రమణము

బ్రహ్మసిద్ధాంత వాక్యములనుబట్టియు యిక మ ప్రత్యక్షముగా ఆకాశమందు చూపట్టుచుండిన దానినిబట్టియు సప్తర్షులు సవ్యముగానే తిరుగుచుండిరని చెప్పవలయును గాని వెనుకకు తిరుగుచుం

నటుల చెప్పుటకు సావకాశము గనుపించదు. వెనుకకు తిరుగుచుండి నటుల కొందరనుచున్నారు. దానికనువగు కలిరాజ వృత్తాంతము లోని వాక్యమును జూపుచున్నారు. పరిక్షిన్మహారాజు కాలమున సప్తఋషులు మఖనుండి ఆశ్లేషకు వచ్చిన శ్లోక వాక్యము మాత్రము జూపుచున్నారు. పురాణము లన్నియు సవ్యముగా తిరుగు చున్నటుల అంగీకరించుచున్నవి. అంతకంటె వారు బలీయమైన జ్యోతిశ్శాస్త్ర సిద్ధాంత వాక్యమును జూపినట్లు కనుపించదు. అందుకు వ్యతిరేకముగా "ప్రత్యబ్దం ప్రాగ్గతిస్తే షాముష్టాలిప్తా మునీశ్వరః" అని సప్తఋషిమండలము ప్రతిసం॥ రము యెనిమిది లిప్తలు సవ్యమైన గతి అనగా పడమరనుండి తూర్పుకు తిరుగుచుండునని బ్రహ్మసిద్ధాంతము కంఠోక్తిగ చెప్పుచున్నది. ఈ విషయములో సూర్యసిద్ధాంతమం దేమియు చెప్పబడియుండనందున సూర్యసిద్ధాంతమునకు వ్యాఖ్యానకారుడైన యల్లయాచార్యుడు తన వ్యాఖ్యానములో సూర్యసిద్ధాంతమం దీవిషయము చెప్పనందున బ్రహ్మ సిద్ధాంతమునుండి తీసుకొనుచున్నానని చెప్పియున్నాడు. ఈ విషయమున "ఎన్సైక్లోపెడియా బ్రిటానికా" యను గ్రంథములో (Ursa Majar) (ఉర్సా మేజరు) అను విషయమునుగురించి వ్రాయ బడినదానిలో నిట్లు వ్రాయుబడియున్నది. హిందువులు సప్తఋషులని జెప్పెడిదానిలో ధ్రువునకి సరళరేఖలో (స్ట్రైయిటులైను) తిన్నగా నుండునది 'పాయింటరు' అనినన్ని (ఇదియే క్రతువు) ఇదియును దిగువ చివరనుండునదియు దీనిలో చేరవనిన్నీ (ఇదియే మరీచి) సప్తఋషు లలో ఆ రెంటిని మినహాయించగా మిగతా మధ్యగల అయిదు నక్షత్రములు పులహ, పులస్త్య, అత్రి, అంగీరస, వసిష్ఠులను అయిదు నక్షత్రములు నాగలిదుంపవలె నేర్పడియుండి అన్ని గ్రహములకు మామూలుగా నుండెడి సవ్యమైన నడకను గలిగియున్నవనియు చెప్పబడియున్నది ఆ మాటలిక్కడ జూపబడుచున్నవి.

"Five stars of the plough form an associated group with common proper motion" అని చెప్పబడినది.

దీనినిబట్టికూడా సప్తఋషులకు సవ్యమైన నడకనే అంగీకరింపక తప్పదు. వెనుకకు తిరుగుచుండినటుల (Retrograde motion) చెప్పెడి వాదమునకు బలవత్తర ప్రమాణమేమియు కనుపడుట లేదు. ప్రత్యక్షముగా యిప్పుడు మన పూర్వాకాశమును కనునించిన మఖనుండి పుబ్బ సమీపమునకు వచ్చియున్నవని స్పష్టముగా గానవచ్చుచున్నది.

శ్రీకల్యాణానంద భారతీస్వాములవారు (గుంటూరులోని శ్రీ శృంగేరి విరూపాక్ష పీఠాధిపతులు) కలి 5032 సం॥రములోనే పూర్వ ఫల్గునీలో ప్రవేసించినదనియు తాము ముప్పది సం॥రములనుండియు దాని నడకను గమనించుచుంటిమనియు, అది సవ్యమైన నడకలోనే జరుగుచు మఖనుండి పుబ్బ (పూర్వఫల్గునీ)కు చేరినదనియు స్వానుభవములో వ్రాసియుండిరి. దీనిని మనము త్రోసివేయుటకు వీలు లేదు. గనుక సప్తర్షి మండలము సవ్యముగానే తిరుగుచుండినటుల సిద్ధాంతీకరించుటయే యుక్తము.

శ్రీ కల్యాణానంద భారతీస్వాములవారు స్వయముగా బరిశోధించి వారి స్వానుభవమును మనకు వెల్లడించి మన సందేహముల దీర్చినందుకు వారికి మా సాష్టాంగ వందనసహస్రము లర్పించుచున్నాము.

## కలి ప్రవేశకాలము

సప్తర్షి మండలము కలి ప్రవేశకాలమున "మఖా" నక్షత్రమందున్నటుల పురాణములు చెప్పుచున్నవి. కలి మొదటి సం॥రముననే "పరీక్షిత్తు" చక్రవర్తి పట్టాభిషేకము జరిగినందున పరీక్షితుని కాలములో సప్తర్షి మండలము మఖానక్షత్రమందున్నటుల స్పష్టము. ఆ విషయము విష్ణుపురాణమం దిటుల చెప్పబడియున్నది.

"తేతుపారీక్షితే కాలే మఖాస్వాసన్ద్విజోత్తమ
తదా ప్రవృత్తశ్చకలిః ద్వాదశాబ్దశతాత్మకః॥
యస్మిన్ కృష్ణోదివం యాత స్తస్మిన్నేవ తదాహని।
ప్రతిపన్నం కలియుగం తస్యసంఖ్యాంనిబోధమే॥

గతే సనాతనస్యాంశో విష్ణోస్తత్ర భువోదివం।
తత్యాజసానుజోరాజ్యం ధర్మపుత్రో యుధిష్ఠిరః॥
విపరీతాని దృష్ట్వాచనిమిత్తాని హిపాండవః!
యాతేకృష్ణేచ కారాధసోభిషేకం పరీక్షితః"॥

పై పురాణవాక్యమువలన సప్తర్షి మండలం పరీక్షితుని కాలములో మఘానక్షత్రమం దున్నటుల తెలియుచున్నది. ఇప్పుడు అది పూర్వఫల్గుణిని సమీపించు చున్నది? కలి ప్రవేశ కాలము నవీనులకు అలవాటుగానున్న లెఖ్ఖప్రకారము క్రీ. పూ 20,2-3102 2 గం. 27ని. 30 సెకండ్లు, "లాప్లాస్"యను ఫ్రెంచి ఖగోళశాస్త్రజ్ఞుఁడు లెఖ వేసి నిముసముల, సెకండ్లతోసహా సరిగానున్నట్లు కనుగొని హిందువుల జ్యోతిశ్శాస్త్రజ్ఞానమున కాశ్చర్యపడి యుండెను. ప్రాశ్చాత్యశాస్త్రజ్ఞులందరంగీకరించిన యిట్టి సుప్రసిద్ధకాలమునువదలి నవీనచరిత్రకారులు తమ హ్రస్వదృష్టితో ప్రాచీనగ్రంథములలోని పూర్వాపర సందర్భములను వదలి తామిదివరకే నిశ్చయించుకొనియుండిన ఒకనిశ్చయమును దృఢపచుకొనుటకనుకూలించెడి వాక్యములనేరుకొని చారిత్రక పురుషులకాలనిర్ణయమును చేయజూచుట అన్యాయము గనుక భారతవర్షముయొక్క చరిత్రను వ్రాయబూనినవారు పండితులెల్ల రంగీకరించిన కలి ప్రవేశకాలమును (అనగా క్రీ॥పూ 3102) గాని లేక యుధిష్ఠిరశకము (క్రీ॥పూ 3138)ను గాని ప్రాతిపదికగా తీసుకొని పూర్వమనియు, పిమ్మట అనియు గుర్తులతో ముందుచరిత్రలలో జూపుట సమంజసముగా నుండును గనుక మా చదువరులందరు ప్రస్తుతము క్రీస్తుశకమును వదలి భారతీయశకముల ననుసరించి చారిత్రక కాలములను లెక్కించుకొన గోరుచున్నాము.

క్రీ॥ పూ 3102 సం॥ ఫిబ్రవరి 18 తేదీ ఉదయం 8 గంటలకు (అనగా కలి ప్రవేశకాలముకు 2 రోజుల 6 గంటల 27 నిముసముల 30 సెకండ్లకు ముందు) ఉజ్జయినియందుండిన గ్రహగతులు,

| | సిద్ధాంతశిరోమణి గ్రంథముప్రకారం డిగ్రీలు | ఆర్యసిద్ధాంతం ప్రకారం | పరాశరసిద్ధాంతం ప్రకారం |
|---|---|---|---|
| ౧. సూర్యుడు | 0-0-0-0 | 0-0-0-0 | 0-0-0-0 |
| ౨. చంద్రుడు | 0-0-0-0 | 0-0-0-0 | 0-0-0-48 |
| 3. బుధుడు | 11-27-24-29 | 11-21-21-36 | 11-21-17-17 |
| ౪. శుక్రుడు | 11-28-42-14 | 11-27-07-12 | 11-26-58-34 |
| ౫. కుజుడు | 11-29-03-50 | 0-0-0-0 | 11-29-14-38 |
| ౬. గురువు | 11-29-27-36 | 11-27-07-12 | 11-27-02-53 |
| ౭. శని | 11-28-46-34 | 0-0-0-0 | 11-28-57-22 |
| (Apris) రాహువు or (ఉచ్ఛ) | 4-05-29-46 | 4-03-50-24 | 4-05-12-29 |
| (Node) కేతువు or (పాత) | 5-03-12-58 | 5-02-38-24 | 5-02-49-12 |

ర. చ. బు
కు.గు.శ
శు.

సూర్యుడు మేషరాశిలో ప్రవేశించినది మొదలు యొక్కొక రాశిలో భోగకాలము సౌర సం॥ర దినముల లెక్క.

| | | | |
|---|---|---|---|
| ౧. | మేషము | — | 30-56-29 |
| ౨. | వృషభము | — | 31-24-49 |
| ౩. | మిధునము | — | 31-38-01 |
| ౪. | కర్కాటకం | — | 31-28-13 |
| ౫. | సింహము — | — | 31-01-50 |
| ౬. | కన్య | — | 30-26-42 |
| ౭. | తుల | — | 29-53-13 |
| ౮. | వృశ్చికము | — | 29-29-50 |
| ౯. | ధనస్సు | — | 29-19-34 |
| ౧౦. | మకరము | — | 29-27-17 |
| ౧౧. | కుంభము | — | 29-48-43 |
| ౧౨. | మీనము | — | 30-20-50 |
| | | | 365-15-31 |

## వైదికధర్మ ప్రవర్తకులు

ద్వాపరయుగాంత కలిశక ప్రారంభ శతాబ్దములో వైదికధర్మ ప్రవర్తకులయిన వేదవ్యాసులు, శ్రీశుకులు, పైల, జైమిని, సుమంత, వైశంపాయన యాస్క, తిత్తిరి, మొదలైన మహామునులుండియుండిరి. గొప్ప ఖగోళ శాస్త్రజ్ఞుడైన ఆర్యభట్టు కలి 340 సం॥ రములో జన్మించెను. కలి శ, 400 వరకు జీవించియుండెను. గొప్ప వ్యాకరణవేత్తలైన పాణిని, ఉపవర్షణ, కాత్యాయనాదులున్నూ సూత్రకర్తలైన బోధాయన, ఆపస్తంబ, హిరణ్యకేసులున్నూ గొప్ప నైఘంటికుడైన వ్యాదియు కలినాలుగవ శతాబ్దములో పునైన జన్మించియుండిరి.

## బ్రహ్మగుప్తాదుల బీజక్షేత్ర గణితాదులు పాశ్చాత్య భాషలలో కనువదింపబడుట

గొప్పగణిత శాస్త్రవేత్తయు, ఖగోళశాస్త్రవేత్తయు, నైన బ్రహ్మగుప్తుడను మహా విద్వాంసుడు క్రీస్తుశక. మూడవ శతాబ్ద

ములో (అనగా కలి 34 శతాబ్దము)జీవించియుండెను. బ్రహ్మస్ఫుట సిద్ధాంతములో రెండధ్యాయములను, గణిత శాస్త్ర సంబంధమైన అంకగణితము, రేఖా గణితము, బీజ గణితము, క్షేత్ర గణితములను వివరించెను.

(Arthmetical progression, quadric equation and proofs of Various Geometrical theorems, on the right-angled triangles, on areas of triangles and quadrilaterals, and on surfaces and Volumes.)

ఈ బ్రహ్మగుప్తుని గురించి ఎన్సైక్లోపీడియా బ్రిటానికా 14 కూర్పు 3 వ వాల్యూము 1012 పేజీలో యీ విధముగా వ్రాయబడినది.

Brahmagupta (was an) Indian Mathematician and Astronomer, set forth the Astronomical system of-Brahma in verse form, the Brahma-Sphuta Siddhanta, in which two chapters are devoted to Mathematics, including an Arithmetical progression a quadric equation, and proofs of Various Geometrical theorems on the right-angled triangle, on areas of triangles and quadrilaterals, and on surfaces and volumes. These two chapters were translated into English by H. T. Colebrook in his Algebra with arithmetic and mensuration, from the Sanskrit of Brahmagupta and Bhaskara preceded by a dissertation of the state of science as known to the Hindus (1871)

తా॥ "బ్రహ్మగుప్తుడు భారతీయ గణిత శాస్త్రజ్ఞుడున్నూ, ఖగోళ శాస్త్రజ్ఞుడున్నూ ఐయున్నాడు. ఈయన బ్రహ్మ సిద్ధాంతమును జ్యోతిష గ్రంథమును వచనములో వ్రాసియుండెను. దీనికి బ్రహ్మస్ఫుట సిద్ధాంతమని పేరు. అందు అంకగణితము (Mathematics, Algebra, Geometry, బీజ, క్షేత్ర, రేఖాగణితములనుగురించి రెండు అధ్యాయములు వ్రాసియుండెను ముక్కోణములు, చతురశ్రములు మొదలయిన వానికి వైశాల్యాలు (పరిమాణములు) కట్టుటనుగురించి పూర్తిగా వివరించెను. ఈ రెండు అధ్యాయములను యింకను భాస్కరాచార్యులుగారిచే

వ్రాయబడిన జామేట్రివగయిరా గ్రంథములను హెచ్. టి. కోల్ బ్రూకు అను పాశ్చాత్యుడు యింగ్లీషుభాషలోకి తర్జుమా చేసుకొని "బీజగణిత శాస్త్రమను పేరున (Alqebra) నొక గ్రంథమును వ్రాసి భారతీయుల శాస్త్రపాండిత్యమును గురించి వేనోళ్ళ బొగడి యుండెను (1871) ఈ విధముగా సర్వశాస్త్రములును క్రీ॥శ 16వ శతాబ్దమునుండి 19 శతాబ్దాంతము లోపల భారతీయ శాస్త్రములనుండి సంగ్రహింపబడి సంస్కృతమునుండి వారివారి భాషలలోని కనువదింపబడి పశ్చిమఖండమున ప్రకటింపబడినవి. ఎనిమిదవ శతాబ్దములో అరబ్బులు బ్రహ్మగుప్తుని "బ్రహ్మసిద్ధాంతము"ను వారిభాషలోని కనువదించుకొనిరి "అల్వాజారీ" యను మహామ్మదీయుడు మొట్టమొదట అరబ్బీభాషలోని కనువదించినవాడు.

భాస్కరాచార్యులు :- కలి 3586 సం॥ (క్రీ॥ శ. 486 సం. రం.) ములో "భాస్కరాచార్యులు" జననమొందెను ఈయన ఖగోళశాస్త్ర పండితుడు "ఉజ్జయిని"లోని నక్షత్రగణితశా॥ (అబ్జర్వేటరి) కధ్యక్షుడుగా నుండెను. ఈయన గొప్ప గణితశాస్త్రవేత్తయు, ఖగోళశాస్త్రపండితుడునై యుండెను. ఖగోళశాస్త్ర విషయములను, గణితశాస్త్ర విషయములనుగురించి యీయన "సిద్ధాంతశిరోమణి" యను గ్రంథమును రచించెను. ఇందులోనుండి "కోల్ బ్రూకు" దొరగణితశాస్త్రసంబంధమైన క్షేత్రగణిత (జామెట్రి) బీజగణిత (అల్జిబ్రా) అంకగణిత (మ్యాథమాటిక్సు) త్రికోణగణిత (ట్రిగ్నామెటరి) ములకు సంబంధించిన విషయములనన్నిటిని తర్జుమా చేసుకొని గ్రంథమును రచించి ప్రకటించియుండెను" "యల్ విల్కిన్సన్" యను నొక పాశ్చాత్యుడు భాస్కరాచారి గ్రంథములోని ఖగోళశాస్త్ర భాగములను తన భాషలోని కనువదించి ప్రకటించియుండెను. దశాంకగణితము (డిసిమలు) నీయన నెక్కుడ వివరముగా వ్రాసియున్నాడు. ఈయన సిద్ధాంతములు యూరపుఖండములో క్రీ॥ శ. పన్నెండవ శతాబ్దములోనే వ్యాపించినది.

(ఎన్ సైక్లోపిడియా బ్రిటానికా 14 కూర్పు, 3వ వాల్యూం. 494 పేజీ)

క్రీ. శ. పం|డెండవ శతాబ్దములోన వ్యాపించినవి. కోల్‌బ్రూకుచే జేయబడిన తర్జుమాలను గురించి "డబ్ల్యు, డబ్ల్యురోస్. బాల్ అను నాయన తనచే వ్రాయబడిన గణితశాస్త్ర చరిత్రయను గ్రంథపీఠికలో వివరించియుండెను.

పై విషయము "ఎన్‌సైక్లోపేడియా బ్రిటానికా 14 వ కూర్పు 3 వ వాల్యూం 494 పేజీలో యిట్లుదాహరింపబడినది.

"Bhaskara (b. 1114) known as Acharya (the learned) Indian astronomer and mathematician, was the head of an observatory at Ujjain. He wrote in verse on astronomy and Mathematics, the Siddhantashiromani. The chapters on Mathematics were translated by Colbrook with the work of "Brahmagupta" (Q. V.) and those on astronomy by L. Wilkinson (Calcutta 1842) It is practically certain that "Bhaskara was acquainted with Arabic writings on Mathematics; and seems that the results of his own work were known in Europe in the 12 th. century. In Bhaskara's work the Arabic numerals are used and he was the first writer to give a systamatic exposition of the decimal system. He enunciates the ordinary rules of Arithematic, Arithmetical and Geometrical progressions, simaltaneous and quadratic equations, and some trignometrical formulae"

(See the Dissertation of Colbrook, prefixed to his Edition (1817) W. W. Rouse Ball, Short account of the History of Mathematics.)

ఆల్బెరూని ఇండియా అను గ్రంథమునుండి

| ఇతర సిద్ధాంతులు | వారిచే వ్రాయబడిన జ్యోతిష గ్రంథములు |
|---|---|
| ౧. మహాదేవుడు<br>౨. విమలబుద్ధి | ప్రశ్న పత్రిశాస్త్రములు మూడు వీరిచే వ్రాయబడినవి. |
| 3. బుద్ధ | గూఢమానయను గ్రంథము |
| ౪. ఉత్పలుడు | ప్రశ్నగూఢమాన |
| ౫. సుగ్రీవుడు - (బౌద్ధుడు) | 'దధిసాగరయను ఖగోళశాస్త్రము |

| | |
|---|---|
| ౬. శ్రీసుగ్రీవునశిష్యుడు (పేరు తెలియదు) వీరిద్దరు (౫-౬) బ్రహ్మగుప్తునికి పూర్వులు | కూరబాబయు లవణముష్టియను పేరుగల ఖగోళశాస్త్ర గ్రంథము |
| ౭. మనువు | "మానస"యను గ్రంథము |
| ౮. ఉత్పల | "మానస"యను గ్రంథముకు వ్యాఖ్యానము వ్రాసినాడు |
| ౯. బ్రహ్మభట్టల | "భట్టిల"యను గ్రంథము |
| ౧౦. బ్రహ్మగుప్తుడు | ౧. బ్రహ్మసిద్ధాంతము వచనరూపమున వివరించెను. ౨. ఖండఖాద్యకటిప్పణి ౩. కరణ ఖండఖాద్యక ౪. ఉత్తర ఖండఖాద్యక |
| ౧౧. విజయనందిన్ (కాశీనివాసి) | "కర్ణతిలక"యను గ్రంథమును రచించినాడు |
| ౧౨. భాస్కర లేక భాస్కరాచార్య (మహేశ్వర లేక మహాదేవుని కుమారుడు) | "కర్ణసార లేక కర్ణకుతూహల" యను గ్రంథమును రచించెను |

అల్బెరూని ఇండియా గ్రంథము అరబిక్కు భాషలో వ్రాయబడి ఫ్రెంచి, జర్మనీ ఇంగ్లీషు భాషలలోనికి తర్జుమా చేయబడినది, అట్లు యింగ్లీషు భాషలోనికి తర్జుమా చేయుటలో పేర్లు తారుమారు చేయబడి భాస్కరుడు విత్తేశ్వరుడుగా మార్చబడినాడు. ఈతని తండ్రి మహాదేవుడను పేరు భదత్తుడుగా మార్చబడినది క్రీ. శ 1114 సం॥ రములో భాస్కరుడున్నట్లు తాము నిర్ణయించిన మిధ్యానిర్ణయమున కెక్కడ భంగముకలుగునో యను భయమున యిటీవలి మన పాశ్చాత్యవిద్వాంసులు మహాదేవుని కుమారుడైన "భాస్కరుడను" అరబ్బిభాషలోని పదోచ్చారణను మార్చివైచి మహాదేవుని భదత్తుడనియు 'భాస్కరుని' విత్తేశ్వరుడనియు మార్చి అల్బెరూనిచే వ్రాయబడిన "ఇండికా" యను గ్రంథముయొక్క 1915 సం॥ రపు ఇంగ్లీషు

తర్జుమాలోచేర్చి భాస్కరుని పేరుకూడా తెలియకుండునట్లు చేసి యుండిరి. కాని వీరికంటె ముందు అల్బెరూని "ఇండికా" గ్రంథమును క్రీ. శ. 1859 సం॥రములో ఫ్రెంచి విద్వాంసులును 1875 సం॥రములో జర్మన్ విద్వాంసుడును 1878 సం॥రమున ఆంగ్లేయ విద్వాంసుడును వారివారిభాషలలో కనువదించియుండిరి. వారను వదించిన గ్రంథములలో మహాదేవునికుమారుడు భాస్కరునివలన వ్రాయబడినటుల అల్బెరూని స్పష్టముగానే వ్రాసియున్నాడనియు దానినింకొకవిధముగా భాషోచ్చారణలో భేదమును కల్పించుటకవకాశము లేనటుల "భాస్కర" శబ్దము వ్రాయబడియున్నదనియు భాస్కరుడు 1114 సం॥రములో పుట్టెనని నిర్ధారణ చేయబడినందున 1030 సం॥రములో అల్బెరూని భాస్కరుని వ్రాసియున్నందునను ఆ భాస్కరుడు వేరని చెప్పుటకంటె గత్యంతరములేదని వారందరును వ్రాసియుండగా 1915 సం॥రములో వ్రాయబడిన ఇంగ్లీషు తర్జుమాలో మహాదేవునిపేరును, భాస్కరుని పేరును పూర్తిగా తొలగించి భదత్తుని కుమారుడు విత్తేశ్వరుడని క్రొత్తపేర్లు కల్పించి వ్రాసియుండిరి. ఇది గర్హింపతగిన విషయము ఈ విషయము భాస్కరాచార్యుల కాలప్రశంసలో సప్రమాణముగా చూపబడినది.

౧౩. ఉత్పల (కాశ్మీర దేశస్థుడు "రాహుగ్రాకరణ" "కర్ణపాత"
౧౪. కల్యాణవర్మన్ "సారావళి" ఈ గ్రంథము పర్షియన్ భాషలోనికి తర్జుమాచేయబడి "గుజిడ" యని పేరుపెట్టబడినది.
౧౫. లోకానంద "లోకానందము" అను గ్రంథమును రచించెను
౧౬. భానుయాన "కర్ణపరతిలక" అను గ్రంథమును రచించెను.

గ్రంథములు తెలియని గ్రంథకర్తల పేర్లు.

౧. ప్రద్యుమ్న ౨. శృంఖల ౩. దివాకర ౪. పరేశ్వర ౫. సారస్వత ౬. పీరువాన ౭. దేవకీర్తి ౮. ప్రిథూదకస్వామిన్.

గ్రంథకర్త పేరులేని గ్రంథములు :- ౧. "కర్ణచూడామణి"

## ఆర్యభట్టుకాలప్రశంస

ఈయన ఆర్యభటీయం; దశగీతిక; ఆర్యాష్టశతయును గ్రంథములు వ్రాసియున్నాడు.

"షష్ట్యబ్దానాం షష్టిర్యదా వ్యతీతాస్త్రయశ్చయుగపాదాః।
త్ర్యధికావింశతిరబ్దాస్తదేహ మమజన్మనోఽతీతాః॥"
(ఆర్యభటీయం కాలక్రియాపాదం శ్లో॥ ౧౦)

తా॥ కలియుగము 60 × 6=360 సం॥రము నాటికి దానిరువది మూడు సం॥రముల వయసు కలిగియున్నట్లు చెప్పుకొనియున్నాడు. కాని పాశ్చాత్య సిద్ధాంతులును వారి యనుయాయులైన హైందవ సిద్ధాంతులునైనం సుధాకరద్వివేది పండితులుపై శ్లోకపాఠమును కొంచెముమార్చి ఆర్యభట్టు కాలమును క్రీ॥ శ॥ 500 సం॥రముకు దెచ్చి కాలనిర్ణయముచేసి గ్రంథములు వ్రాసియుండిరి. ఆ గ్రంథములనే కాలనిర్ణయములలో మిగత సిద్ధాంతులనుసరించుచుండిరి. కాన వారుచేసిన మార్పును విమర్శించుచు సత్యాన్వేషణమును జేయుదుము. మార్పుచేయబడిన శ్లోకపాఠము:-

శ్లో॥ షష్ట్యబ్దానాం షష్టిర్యదావ్యతీతాస్త్రయశ్చయుగపాదాః।
త్ర్యధికావింశతిరబ్దాస్తదేహ మమజన్మనోఽతీతాః॥"

తా॥ కలిలో 60 × 60=3600 సం॥రములనాటికి నాకు 23 సం॥రముల వయస్సు అని మార్చియుండిరి. దీనిబట్టి ఆర్యభట్టు కలి 3600-23=3577 సం॥ కలిలో జన్మించియుండెనని మార్పుచేసి చెప్పియుండిరి. క్రీ॥ పూ॥ 57 సం॥ విక్రమ శకప్రారంభమున విక్రమార్క మహారాజాస్థానమందుండిన నవరత్నములలోనివాడగు కాళిదాసు తనచే వ్రాయబడినం జ్యోతిర్విదాభరణమను గ్రంథమున కలి 3068 సం॥రములోని వైశాఖమాసమున జ్యోతిర్విదాభరణ గ్రంథమును రచింపమొదలిడి ఆ సం॥ర కార్తీక మాసములో పూర్తిచేయబడినటుల చెప్పియున్నాడు. ఆ గ్రంథములో ఆర్యభట్టునుగురించియు, ఆర్యభటీయ గ్రంథమును గురించియు ప్రశంసగలదు. అందువలన పాశ్చాత్యవిద్వాంసుల నిర్ణయముకు 532 సం॥రములకు ముందే

ఆర్యభటీయము ప్రచారమునందున్నటుల స్పష్టపడుచున్నది. దీనికి సమాధానము చెప్పుటకు దోచక జ్యోతిర్విదాభరణమున పై విషయము ప్రక్షిప్తమైనటుల జెప్పి సంతృప్తులైరి. కాళిదాసుతో సహా వరాహమిహిరుడు కూడను విక్రమార్కుని యాస్థానమున నవరత్నములలో నున్నటు జ్యోతిర్విదాభరణమున గలదు. గనుక వరాహమిహిరుడు క్రీ॥ పూ॥ 57 సం॥రములో నున్నాడనుట తథ్యము. ఆయన తన బృహత్సంహితలో 2526 సం॥రములకు అప్పుడు ప్రవర్తమగుచుండిన శకకాలమును కలిపిన యుధిష్ఠిరకాలము వచ్చునని చెప్పియున్నాడు. (13 అధ్యా 3 శ్లో॥ ఆశ్లోకమును భాస్కరాచారి కాల ప్రశంసలో చూడనగును.) యుధిష్ఠిరకాల లేక లౌకికాబ్దము 2526 సం॥రమున (అనగా క్రీ॥ పూ॥ 550 సం॥) శకకాలమను శకమొకటి ప్రవర్తమైనటుల స్పష్టపడుచున్నది. అది శాలివాహనశకము కానేరదు. శాలివాహనశకము క్రీ. శ. 78 సం॥రమున ప్రారంభింపబడినటు లందరెరింగిన విషయమే. దానికి 628 సం॥రములకు ముందునుండి శక కాలమనునదొకటి ప్రవర్తించుచున్నటుల మనకు పై ప్రమాణమువలన స్పష్టపడుచున్నది. ఇది పారశీక దేశమందు శకసామ్రాజ్యమును స్థాపించిన "సైరసుద్రేటు" అను వానివలన ప్రవర్తింపజేయబడిన శకమైయున్నది. దీనికాలము క్రీ॥ పూ 550 సం॥రముగా వాడబడుచున్నది. ఈ శకమునే పూర్వపు సిద్ధాంతులు తమ గ్రంథములలో వాడియుండిరి. పిమ్మట రాబడిన శాలివాహనశకమును గూడ శకకాలమని వ్యవహరించుటవలన రెండుశకములు తారుమారు చేయబడి "శాకే" యని చెప్పబడిన చోటులనెల్లను యిటీవలి సిద్ధాంతులు శాలివాహన శకమునకు సమన్వయించుకొనుటవలన సిద్ధాంతుల కాలములలో వ్యత్యాసములు కలిగినవి. ఈ విషయము వరాహమిహిర భాస్కరాచారి కాలప్రశంసలలో వివరింపబడినది. భారతీయ సిద్ధాంతులే శక కాలములను గుర్తించుటలో పొరబడియుండగా పాశ్చాత్యపండితులు పొరబడుటలో నాశ్చర్యము లేదు. ఇటీవలి సిద్ధాంతులవారినేపోయి పాశ్చాత్యులును కాలనిర్ణయము జేసి

యుండిరి. వీరిసిద్ధాంతము ప్రకారము క్రీ॥ శ. 500 సం॥ రము (కలి 5044-3600=1444 దీనిని క్రీ॥ శ 1944-1444=500 క్రీ॥ శ.) లో అర్యభట్టు వుండవలెను. అప్పుడే వారి సిద్ధాంతముప్రకారం వరాహమిహిరుడు, కాళిదాసు వున్నారు, కనుక అర్యభట్టుకూడను విక్రమార్కుని కాలములో నున్నాడని చెప్పవలసివచ్చును, అట్లు చెప్పినను విక్రమార్కుని కాలము కలి 3068 సం॥రము అనగా క్రీ॥ పూ॥ 57 సం॥రము గాని వారూహించినట్లు క్రీ॥ శ. 500 కానేరదు ఎటుజూచినను యీ వాదము నిలువనేరదు గనుక ఆర్యభటీయములో చెప్పబడిన శ్లోకము "షష్ట్యబ్దానాం షడ్భిర్యదా" యను పాఠమే సమంజసముగాని "షష్ట్యబ్దానాం షష్టిర్యదా" యనునది కానేరదు. ఈ పాఠాంతర మిటీవల అచ్చుపడిన గ్రంథములలో సుధాకర ద్వివేది పండితునివలన సవరింపబడి వ్రాయబడినది. పూర్వపు తాళపత్ర గ్రంథములలో "షడ్భి" యనే యుండియున్నది. గనుక ఆర్యభట్టు కాలము (60 × 6=)కలి 360 సం॥రమనుటయే సమంజసము, ఈ విషయములో టి. యస్. నారాయణశాస్త్రి బి. ఏ, బి. యల్, గారు తమచే వ్రాయబడిన "Age of Sankara యను గ్రంథము part I. B. page 161 పేజీలో 1917 సం॥రములో నీవిధముగావ్రాసియుండిరి. "We challenge Sudhakara Dyivedi or any of his advocates to bring to our notice any genuine manuscript which give "షష్ట్యబ్దానాంషష్టిః" in place of "షష్ట్యబ్దానాం షడ్భిః" which we find in a number of old M. S. S. copies of Aryabhattiyam in Southren India."

సుధాకరద్వివేది పండితుడు చేసిన సవరణ సరియైనదా యను విషయమును విచారించుదము. కలి 3600 సం॥ అనగా క్రీ॥ శ. 498సం॥ రము. (3600-3102=498) దీనినిబట్టి ఆర్యభట్టు క్రీ॥ శ. 498 సం॥రము నాటికి 23 సం॥ రములవాడని తెలియుచున్నది. ఆర్యభటీయమున యుధిష్ఠిరశకము, కలిశకము, లౌకికాబ్దము, అనెడి మూడు శకములు మాత్రమే చెప్పబడియున్నవిగాని యితర శకములేమియు అప్పటికి ప్రారంభమై యుండనందున వాడబడియుండలేదు. క్రీ॥ శ, 498 సం॥

రము నాటికి శకనృపశకము, విక్రమశకము, శాలివాహనశకము, శ్రీహర్షశకము మొదలగు శకములెన్నియోగలవు. కాని యివేవియు ఆర్యభటీయములో వాడబడకుండుటను బట్టియే యీ శకములేవియు నాకాలమున ప్రవర్తింపబడి యుండలేదని స్పష్టము.

వరాహమిహిరుడు క్రీ॥ శ 504 సం॥రమందుండెనని పాశ్చాత్య సిద్ధాంతులు చేసిన నిర్ణయమునే తానవలంబించి యున్నందున ఆర్య భట్టునుకూడా వరాహమిహిరుని కాలమునకు దెచ్చి నాతనితో సమ కాలికునిగా నొనర్చుటకు పై శ్లోకపాఠమున "షడ్భి" యనుదానిని "షష్టి"యని స్వల్పమగు మార్పుగావించి క్రీ॥ పూ॥ 2742 సంఖ్యను (3102-360) క్రీ॥ శ॥ 498 సం॥ను (3600-3102) తెచ్చియున్నాడు ఈ సుధాకరద్వివేది పండితుడు కాశీ విశ్వవిద్యాలయములో పండితు డుగా నుండుటయు, ఆయన పర్యవేక్షణక్రింద జ్యోతిష గ్రంథములచ్చు వేయింపబడుటయు యీ పండితుడింగ్లీషు విద్యాభిరుచి గలిగి యుండుటయే గాక పాశ్చాత్యపండితుల యొక్క గుజాడలలో నడచెడివాడగుట వల నను వారి భావములననుసరించి గ్రంథములచ్చు వేయునప్పుడు వాటి యందు తన భావముల కనుకూలముగా మార్పులనుచేసి జొప్పించి యున్నాడు. వరాహమిహిరుడు విక్రమార్కుని యాస్థానమునందుండిన నవరత్నములలో తనతోపాటు కలిసియుండినటుల "జ్యోతిర్విదాభరణ మను గ్రంథము" న కాళిదాసు స్పష్టముగా జెప్పియుండెను. వరాహమి హిరుడు తనచే వ్రాయబడిన పంచసిద్ధాంతికాది గ్రంథములలో తన కతి ప్రాచీనుడుగానుండిన ఆర్యభట్టు గ్రంథమునుండి అనేక విషయ ములను సంగ్రహించినటుల వ్రాసియుండెను. కనుక వరాహమిహిరునికి అనగా విక్రమశకమైన క్రీ॥ పూ 57 సం॥రమునకు చాలా పూర్వ మందున ఆర్యభట్టున్నటుల చెప్పిన తాను వరాహమిహి రుని కాలమునకు అరవ శతాబ్దమునకు దెచ్చిన నిర్ణయము నకు ప్రతిబంధకముగా నుండునని 'ఆర్యభటీయము' లో మార్పు చేయుటయేగాక జ్యోతిర్విదాభరణములో విక్రమార్కుని యాస్థాన ములో వరాహమిహిరుడు కూడా నున్నట్లు కాళిదసుచే చెప్పబడిన

శ్లోకములు ప్రక్షిప్తమని (అనగా యిటీవల యెవరివలననో చొప్పింపబడినవని) దానిని త్రోసిపుచ్చెను.

కాళిదాసు కాలప్రశంస

రఘువంశము, కుమారసంభవము, మేఘసందేశము, ఋతుసంహారము, శాకుంతలము, మాళవికాగ్నిమిత్రము, విక్రమోర్వశీయము, శ్రుతబోధ, శృంగారతిలకము, జ్యోతిర్విదాభరణము, ఉత్తర కాలామృతము, శృంగార రసాష్టకము, సేతుబంధము, కర్పూరమంజరి, శ్యామలాదండకము, పుష్పబాణ విలాసము, ప్రశ్నోత్తరమాల, కుంతేశ్వర దౌత్యము, రాక్షసకావ్యము. నవరత్నమాల, స్వరశాస్త్రమను శత్రుపరాభవ శాస్త్రము మొదలయిన గ్రంథములను కాళిదాసు రచించియుండెను. శాకుంతల, విక్రమోర్వశీయ, మాళవికాగ్ని మిత్రములను నాటకములను రచించిన కాళిదాసును రఘువంశాదికావ్యములను వ్రాసిన కాళిదాసును వేరువేరు వ్యక్తులనియు, కాళిదాసనాములు ముగ్గురు కలిగియుండిరనియు కొందరనుచుండిరి. జ్యోతిర్విదాభరణ కర్తయగు కాళిదాసును, ఉత్తర కాలామృతకర్తయగు కాళిదాసును మాళవాధీశుడగు విక్రమార్కుని యాస్థానమునందుండినటుల జెప్పుకొనియున్నారు. ఈ రెండు కావ్యముల కర్తయు నొకేవ్యక్తియై యుండెననుట కెట్టిసంశయమును లేదు. కాళిదాసు ఉత్తరకాలామృతమును విక్రమార్కునికి కృతియిచ్చినట్లందలి ప్రథమశ్లోకములలో గానవగును.

శ్లో॥ "శ్రీమద్విక్రమ చతుష్టయాచ్యుత మారస్వర్నాయకాద్యైస్సురైః
కార్యారంభవిధౌ సమర్చిత పదద్వంద్వం ద్విపేంద్రాననం!
పాశాద్యాయుధలక్షు కప్రవిలసద్ హస్తైశ్చతుర్భిర్యుతం!
శ్రీమద్విక్రమ సూర్యపాలన పరం వందే భవానీ సుతమ్॥"

శ్లో॥ కామేశస్య సుహాసుభాగ నిలయాం భక్తాభిలేష్టార్థదాం।
శంఖంచక్ర మదాభయంచ వరదం హస్తైర్దధానాం శివాం!
సింహస్థాం శశిఖండమౌళి లసితాం దేవీం త్రినేత్రోజ్జ్వలాం!
శ్రీమద్విక్రమ సూర్యపాలనపరాం వందేమహా కాళికామ్॥"

జ్యోతిర్విదాభరణమును రచించిన కాళిదాసు దానదివరలో రఘువంశాది కావ్యత్రయమును రచించియుండినట్లును, శకేశ్వరుడగు రూమకేశాధిపతిని మహాసంగ్రామమున జయించి ఉజ్జయినీనగరమును గ్రహించినవాడును, శంకు మొదలుగాగల పండితులను (నవరత్నములని పిలువబడు పండితులు తొమ్మండ్రుగురను) అనేకమంది మహాకవులను, వరహామిహిరాది జ్యోతిర్విదులను బోషించువాడును, యుజ్జయనీ చక్రవర్తియునగు విక్రమార్కునకు తాను మిత్రుడైనట్లును, విక్రమార్కు నాస్థానమందుండు నవరత్నములలో దానొకడైనట్లును, యీ క్రిందిశ్లోకములలో జెప్పుకొనియున్నాడు.

శ్లో॥ "యోరూమ కేశాధిపతిం శకేశ్వరం
జిత్వాగ్రహీతో జ్జయినీం మహాహవే।
ఆనీయ సంభ్రామ్య ముమోచతంత్వహో
శ్రీ విక్రమార్క స్సమసహ్య విక్రమః॥"

శ్లో॥ శంకాదిపండిత వరాః కవయ స్త్వనేకే
జ్యోతిర్విదస్య మభవంశ్చ వరాహపూర్వాః।
శ్రీ విక్రమార్క నృపసంసది మాన్యబుద్ధి
స్తైరప్యహం నృపసఖాకిల కాళిదాసః॥"

శ్లో॥ కావ్యత్రయం సుమతి కృద్రఘువంశపూర్వం।
పూర్వం తతస్మృతి హితంశ్రుతి కర్మవాదం।
జ్యోతిర్విదా భరణకాల విధానశాస్త్రం।
శ్రీ కాళిదాస కవితో హితతో బభూవ॥"

శ్రీ విక్రమార్క మహారాజుయొక్క నాస్థానమందుండిన నవరత్నములనుగురించి జ్యోతిర్విదాభరణమున చెప్పియున్నాడు.

శ్లో॥ 3 "ధన్వంతరి క్షపణ కామర సింహశంకు
వేతాలభట్ట ఘటకర్పర కాళిదాసాః।
ఖ్యాతో వరాహమిహిరో నృపతేస్సభాయాం
రత్నానివై వరరుచిర్నవ విక్రమస్య॥"

జ్యోతిర్విదాభరణమను గ్రంథరచనా కాలము నీ విధముగా చెప్పియున్నాడు (జ్యోతిర్విదాభరణం 22 వ ఆశ్వాసము చూడుము)

శ్లో॥ "వర్షే సింధుర దర్శనాంబర గుణై ర్యాతే కలౌ సమ్మితే।
మాసే మాధవసంజ్ఞికే చ విహితో గ్రంథక్రియోపక్రమః"

తా॥ కలియుగము 3068 సం॥రములు గడచుచుండగా వైశాఖ మాసమునం దీ గ్రంథరచన ప్రారంభించినటుల చెప్పుకొనియున్నాడు. ఇప్పు డీ కలియుగాబ్దము 5044 జరుగుచున్నది. కావున రఘువంశాది కావ్యకర్తయైన కాళిదాసు "జ్యోతిర్విదాభరణము" నిప్పటికి 1976 సం॥రములక్రిందట (5044-3068) అనగా క్రీ॥ పూ॥ 33 (1976-1943 సం॥రమున రచించినట్లు స్పష్టపడుచున్నది. విక్రమార్కుడు క్రీ॥ పూ॥ 57 సం॥రమున విక్రమశకమును స్థాపించినటుల చరిత్రకారులంద రంగీకరించియుండిరి. వరాహమిహిర, కాళిదాసాదు లా విక్రముని యాస్థాన పండితులు గనుక వారికాలము క్రీ॥ పూ॥ 57 సం॥ర మని చెప్పుటకెట్టి సందేహమును లేదు.

## వరాహమిహిరుని కాలప్రశంస

ఈయనచే వ్రాయబడిన గ్రంథములు:- ౧. హోరాశాస్త్రము ౨. సిద్ధాంత ద్వాదశము 3. బృహత్సంహిత ర లఘుజాతకము ౫. పంచసిద్ధాంతిక ౬. బృహజ్జాతకము ౭. షట్పంచశిక ౮. పంచ సిద్ధాంతిక ౯. యోగయాత్ర ౧౦. టికానియాత్ర ౧౧. వివాహ పటల ౧౨. లఘువశిల్పములమీద వ్రాయబడి ని మొదలైన గ్రంథ ముల రచించెను. ఈయన మాళవ దేశాధీశుడగు విక్రమార్కుని యాస్థానమునం దుండెడివాడు. ఈ రాజుయొక్క నాస్థానముననే నవ రత్నము లనదగు కాళిదాసాదు లుండెడివారు. వరాహమిహిరుడు యీ నవరత్నములలో నొకడు, విక్రమార్కు నాస్థానమునం దుండెడి నవరత్నములలో వరాహమిహిరుడుకూడా నుండెనని జ్యోతిర్విదా భరణమున కాళిదాసకవి చెప్పియున్నాడు.

శ్లో॥ "ధన్వంతరిక్షపణ కామరసింహశంకు।
వేతాళభట్ట ఘటకర్పర కాళిదాసాః।
ఖ్యాతో వరాహమిహిరో నృపతేః సభాయాం।
రత్నానివై వరరుచిర్నవ విక్రమస్య॥.
(జ్యోతిర్విదాభరణం అంతిమాధ్యాయము 22వ ఆశ్వాసం)

తా॥ ౧. ధన్వంతరి ౨. క్షపణక ౩. అమరసింహ ౪. శంకు ౫. వేతాళభట్టు ౬. ఘటకర్పర ౭. కాళిదాసు ౮. వరాహమిహిర ౯. వరరుచియీ తొమ్మండుగురు విక్రముని ఆస్థానమున నవరత్నములు. ఈ విక్రముని పేరున క్రీ॥ పూ॥ 57 సం॥రములో నొక శకము ప్రారంభమైనది. ఈ విక్రమార్క మహారాజు క్రీ॥ పూ॥ 101 సం॥రమునుంచి క్రీ॥ పూ॥ 33 సం॥రం వరకు నేపాళ దేశమును పాలించిన 'అంశుమంత' మహారాజునకు సమకాలికుడు. ఈయన నేపాళ దేశమునకు వెళ్ళి తనపేరున యొక శకనిర్మాణము గావించెనని నేపాల దేశరాజ వంశావళియందు గలదు.

## నేపాళరాజ వంశావళి చరిత్ర

నేపాళ దేశమును బరిపాలించిన రాజవంశములలో నాఱవది యగు ఠాకురు వంశమున మొదటి ప్రభువగు "అంశువర్మ" మహారాజు పరిపాలన మొనర్చుకాలమున మాళవ దేశాధిపతియగు విక్రమాదిత్యుడు నేపాళ దేశమునకు వచ్చినట్లును నొక శకము నేర్పాటు గావించినట్లును "నేపాళ వంశావళి" యను నేపాళదేశపు చరిత్ర చెప్పుచున్నది. ఈ వంశావళి కలియుగ ప్రవేశమునకు పూర్వము నుండియు (అనగా ద్వాపరయుగము చివరిభాగమునుండి) కలి 3000 పైకాలము వరకు రాజ చరిత్రములను జెప్పుచున్నది. అందు నేపాళ దేశమును పరిపాలించిన ఐదవ రాజవంశము సూర్యవంశమనియు, నా వంశమున భూమివర్మ మొదటివాడనియు, ఆయన కలియుగము 1389 సం॥రమున పట్టాభిషిక్తు డయ్యెననియు చెప్పబడియున్నది. ఆయా వంశములలో పరిపాలించిన రాజుల పరిపాలనాకాలములు

కలియుగాబ్దములలో చెప్పబడియున్నవి. దానినిబట్టి సూర్యవంశములో నిరువదియేడవ ప్రభువగు శివదేవవర్మ కలి2764 సం॥(అనగా క్రీ॥ పూ॥ 338 సం॥)రమున పరిపాలన సలుపుచున్నటుల స్పష్టముగా గనుపట్టుచున్నది. ఆరవ వంశమగు ఠాకూరు వంశములో మొట్ట మొదటి రాజగు సంశుమంతుడు కలి 3000 సం॥రమున (క్రీ॥ పూ॥ 101 సం॥) పట్టాభిషిక్తుడైనటుల స్పష్టముగ జెప్పబడి యుండెను. అంశుమంతుడు (68) అరువదెనిమిదేడులు రాజ్యపాలన మొనర్చినట్లు చెప్పబడినది. కావున అంశుమంతుడు క్రీ॥ పూ॥ 101 సం॥రం లగాయతు క్రీ॥ పూ॥ 33 సం॥ రం వరకు (101-68=33) రాజ్యమును పాలించియుండెను, ఈతని పరిపాలనాకాలముననే మాళవాధీశుడగు విక్రమాదిత్యుడు నేపాళదేశమున కుంజని శకము నేర్పాటు గావించె నని చెప్పబడియుండుటచే నయ్యది క్రీ॥ పూ॥ 101 సం॥ల క్రీ॥ పూ॥ 33 సం॥రముల మధ్యకాలములోనై యుండునని స్పష్టపడుచున్నది. విక్రమశక ప్రారంభము క్రీ॥ పూ॥ 57 సం॥రమని యిందువలనకూడా ధ్రువపడుచున్నది.

ఐదవ రాజవంశమగు సూర్యవంశమున కట్టకడపటివాడును ముప్పది యొకటవ రాజును అగు విశ్వదేవవర్మకు సంశుమంతు డల్లుడైనట్లును, విశ్వదేవవర్మ యనంతరము రాజ్యమునకు వచ్చి నట్లును జెప్పబడియున్నది. విశ్వదేవవర్మ 51 సం॥రములు రాజ్య మేలెను. అతనికిపూర్వము విష్ణుదేవవర్మ 47 సం॥రములును నాతనికి ముందు భీమదేవవర్మ 36 సం॥రములును, నాతనికిముందు నరేంద్ర వర్మ 42 సం॥రములును, నరేంద్రవర్మకు పూర్వము శివదేవవర్మ 61 సం॥రములు పరిపాలన మొనర్చినట్లు చెప్పబడియున్నది, కలి యుగాబ్దము 3001 సం॥ర (అనగా క్రీ॥ పూ॥ 101 సం॥ మున) అంశు మంత మహారాజు పట్టాభిషిక్తుడయ్యెను.

(ఇండియన్ ఆంటిక్వెటి వాల్యూం XIII పేజీ 411 లగాయతు 428 వరకు ప్రచురింపబడిన 'నేపాళ వంశావళి'ని చూడుడు)

| | | |
|---|---|---|
| ఐదవవంశము సూర్య వంశములో మొదటి ప్రభువు | రాజుపేరు—పరిపాలించిన--కలిశకం--క్రీ॥శ.ప్రకారం సం॥రములు—ప్రకారం--క్రీ॥పూర్వము. | |
| | భూమివర్మ- 1389సం॥ పట్టాభిషేకము | 1713 |

పైవంశములో

27వ, రాజు—శివదేవవర్మ—61--2764-2825--338-277

,, 28 ,, —నరేంద్రదేవవర్మ—42--2825-2867--277-235

,, 29 ,, —భీమదేవవర్మ—36--2867-2903--235-199

,, 30 ,, —విష్ణుదేవవర్మ—47--2903-2950--199-152

,, 31 ,, —విశ్వదేవవర్మ—51--2950-3001--152-101

| | |
|---|---|
| విశ్వదేవవర్మకు అల్లుడు 'ఠాకురు' వంశములోని మొట్టమొదటి రాజు | అంశుమంతుడు—68--3001--3069-101-33 |

ఈ యంశుమంతుని పరిపాలన కాలము కలి **3045** సం॥ (క్రీ॥ పూ॥ 57)రముననే విక్రమార్క మహారాజు నేపాళదేశమును దర్శించుటయు, విక్రమశకమును స్థాపించుటయు జరిగియున్నది. "నేపాళవంశావళి" యను గ్రంథములో యింతస్పష్టముగా రాజ వంశములు కలి సం॥ రములలో చెప్పబడియుండగా డాక్టరు ఫ్లీటు మొదలైన పాశ్చాత్య పండితులు శివదేవవర్మ శాసనములందు శివ దేవవర్మ పట్టాభిషేకము హర్షశక 119 సం॥ అని యుదహరింపబడిన హర్షశక మేదియను విచారణ సేయకనే భారతీయమయిన ప్రతివిష యమును నిన్నమొన్నటిదిగా చెప్పటయే పనిగా పెట్టుకొని యున్నవా రగుటవలన 'హర్షశకము' క్రీ॥ శ॥ 606 సం॥రమున పరిపాలించిన శ్రీ హర్షశిలాదిత్యుని శకమని చెప్పుచు శివదేవవర్మ క్రీ॥ శ॥ 725 సం॥ మున (606—119=725) పట్టాభిషిక్తుడైనటుల నిర్ధారణ జేయుచు నేపాళ రాజ వంశావళియందు కలియుగాబ్దములు తప్పుగా జెప్పబడియెనని త్రోసివేసి చరిత్రలను తారుమారు జేసియుండిరి. పాశ్చాత్యపండితుల యీ దుడుకుతనము సహింపరానిది, క్షమార్హమైనదికాదు.

ఈ పాశ్చాత్య విద్వాంసుల వాదమునకు బలము కూర్చగల హర్షశకమనున దేదియు యేడవశతాబ్దమునం దుండియుండలేదు. ఇది వారి స్వకపోల కల్పితము. క్రీ॥ శ॥ 1030 సం॥రమున మనదేశములో నుండిన అల్బెరూని పండితుడా కాలమునకు ముందుండిన శకములన్నింటిని తనచే వ్రాయబడిన హిందూదేశచరిత్రలో నిచ్చియున్నాడు. శ్రీహర్షశకము నేపాళదేశమునందును, ఉత్తరహిందూదేశమందును ప్రచారమునం దున్నటుల వ్రాసియున్నాడు. అల్బెరూని పండితుడిచ్చిన శకముల పట్టిక నిచ్చుచున్నాము. అన్ని శక సం॥రములును పారశీకుల యాజడగర్దు 400 సం॥రమునకు సరిగాబోల్చియున్నాడు.

1, క్రీ॥ శ॥ 1031 సం॥ పారశీకుల యాజిడగర్దు శకము. 400 సం॥రమునకు సమానము.

| | | | | |
|---|---|---|---|---|
| 2. శ్రీ హర్షశకము | 1488 | ,, | ,, | ,, |
| 3: విక్రమశకము | 1088 | ,, | ,, | ,, |
| 4. శాలివాహనశకము | 953 | ,, | ,, | ,, |
| 5. కలియుగాబ్దము | 4132 | ,, | ,, | ,, |

అని చెప్పియున్నాడు. (అల్బెరూని ఇండియా డా॥ ఇ. సి. సాచూ చే తర్జుమా చేయబడినది, రెండవవాల్యూం49 అధ్యాయము 5-7 పేజీలు)

క్రీ॥ పిమ్మ టారవ శతాబ్దములో యొక హర్షశక మున్నటుల అల్బెరూని పండితుడు వ్రాసియుండలేదు. పారశీకుల ప్రమాణవత్సరమైన 400 సం॥ క్రీ॥ శ॥ 1031 సం॥ రములకు సమానమని చరిత్రకారులందరంగీకరించినదైయున్నది. మహమ్మదీయ చరిత్రకారుడైన 'అల్బెరూని' చెప్పిన లెఖ్ఖప్రకారము—

| | | | |
|---|---|---|---|
| కలియుగప్రారంభము —క్రీ॥పూ॥— | | 3102— | సం॥రమునను |
| శ్రీ హర్షశకము | ,, | 457 | ,, |
| విక్రమశకము | ,, | 57 | ,, |
| శాలివాహనశకం క్రీ॥శ॥ | | 78 | సం॥రమునను ప్రారంభ |

మైనటుల స్పష్టపడుచున్నది.

శివదేవవర్మ శ్రీహర్షశకము 119 సం॥రములో పట్టాభిషిక్తు డైనాడనగా శ్రీహర్షశక ప్రారంభము క్రీ॥ పూ॥ 457 లోనుండి 119 సం॥రం తీసివేయగా క్రీ॥ పూ॥ 338 సం॥రమున అనగా నేపాళ రాజ వంశావళిలో చెప్పబడిన కలిశక సం॥ 2764 సం॥ర మగును. కలి సం॥రముల లెఖకును శ్రీహర్షశకమునకును యింతస్పష్టమైన లెక్క సరిపోవుచుండగా దీనిని త్రోసివైచిరి. దీనినిబట్టి పాశ్చాత్య పండితు లును వారి యనుయాయులైన హైందవ పండితులును పురాణము లను, చరిత్రలను మథించి తేల్చిన సారాంశమెంతటి వక్రమార్గమును బట్టినదో మనకు సుబోధక మగుచున్నది. పర్గిటరు పండితుడు, తిబాటు పండితుడు, జోన్సు పండితుడు, డా॥ ప్లీటు మొదలుగా గల పాశ్చాత్య పండితులయొక్కయు వారి ననుసరించిన గోపాలయ్యరు, శ్రీశచంద్రవిద్యార్ణవుడు, సుధాకరద్వివేది, స్వామి కన్నుపిళ్లె, మొద లైన హైందవ పండితులయొక్కయు విమర్శలన్నియు నిటులనే వక్ర మార్గమును బట్టియున్నవనుటలో నెవ్వరును సందేహింపనక్కరలేదు, వీరేమో మహాపండితులనియు, వీరి విమర్శనలెక్కువ పటుత్వము గలవనియు వీరినెదిరించి వీరి తప్పుమార్గములను లోకమునకు వెల్లడిం చెడి కాలమువరకు లోకులు నమ్మియుండిరేగాని యిప్పుడెవరును వారి సిద్ధాంతముల నమ్మి మోసపోరని నమ్ముచున్నాము. వారొక భావమును మనసున బెట్టుకొని దానిననువదించుట కవసరమగు విధ మున వాక్యములను వ్యాఖ్యానించియు, సాధ్యముకానిచోట శ్లోక పాదములనేమార్చి తాళపత్రగ్రంథముల నచ్చువేయించియు, లోకు లందరు విమర్శించువారు కానందున తాము చెప్పెడిదానినే నమ్మి ప్రవర్తించెదరని లేనిదానిని కల్పించి తమ విమర్శనములలో జొప్పిం చియు, తమ భావమునకు విరోధముగా నుండుదానినెత్తక యుపేక్షిం చియు, వారు శాయశక్తులా పనిచేసి మన వేదశాస్త్ర పురాణేతిహాస, చారిత్రక వాఙ్మయమునంతయు గలచి కళంకిత మొనర్చిరని చెప్ప వలసి వచ్చినందులకు క్షమింప వేడుచున్నాము.

ఈ మహామహులు మహాభారత యుద్ధకాలమును గురించి విమర్శించి క్రీ॥ పూ॥ 1400 సం॥రం అని కొందరును, 1763 సం॥రం అని కొందరును, 1810 సం॥రమని కొందరును, 1922 సం॥రమని మరికొందరును సిద్ధాంతీకరించిరి. శ్రీయుత గోపాలయ్యరుగారు క్రీ॥ పూ॥ 1193 సం॥ర మనిరి. భారతయుద్ధానంతరం 16 సం॥లకు కలి యుగ ప్రవేశమని చెప్పిరి (అనగా 1193-16=)1177 సం॥రమని అర్థము. అనగా యిప్పటికి కలియుగ ప్రవేశకాలము గోపాలయ్యరు గారి సిద్ధాంతం ప్రకారం 1944 + 1177=3121 సం॥రము లన్నమాట. మన పంచాంగములలో కలిగతాబ్దాః 5044 అని ప్రతిసం॥ర మొక సం॥రమును కలుపుకొనుచు కలియుగాదినుండి లెక్కించుచు వ్రాయ బడుచుండిన లెక్కలన్నియు అబద్ధములేనట. ఈ పండితు డూహిం చిన యూహాప్రపంచమును వాస్తవమని నమ్మవలెనట. మనకు సాంప్రదాయసిద్ధముగా వచ్చుచుండిన లెక్కలన్నియు తప్పులని త్రోసివేయవలెనట. ఇది వీరి విమర్శనాపటిమ. దీనినే తమ సాంప్ర దాయమును మరచిన పురాణవిద్యాధికులు కొందరు గొప్పజేసి నా మార్గమునే యవలంబించి కుతర్కములకు దిగుచుండిరి. వీరికి నచ్చ చెప్పుదమన్నను తమకు వ్యతిరేకముగా జెప్పుదానిని వినుటకైన నిచ్చగింపరు. సత్యాన్వేషణపరులు నిష్పక్షపాతబుద్ధితో గ్రంథావ లోకనమునుజేసి నిజమును గ్రహించెదరుగాక!

ఇదిగాక "జ్యోతిర్విదాభరణం అంతిమాధ్యాయముననే కాళిదాసీ విధముగాకూడా చెప్పియున్నాడు.

శ్లో॥ "వర్షే సింధురదర్శనాంబరగుణైః(3068)ర్యాతే కలే సమ్మితే।
మాసే మాధవసంజ్ఞకేచ విహితో గ్రంథక్రియోపక్రమః।
నానాకాలవిధాన శాస్త్రగదితం జ్ఞానం విలోక్యాదరా।
దూర్జే గ్రంథసమాప్తి రత్రవిహితా జ్యోతిర్విదాం ప్రీతయే॥

తా॥ కలిలో 3068 సం॥రములు వెళ్లగా వైశాఖ మాసములో "జ్యోతిర్విదాభరణమును" గ్రంథమును రచించుటకు ప్రారంభించి ఆ సం॥ర కార్తికమాసములో పూర్తిచేయబడినదని చెప్పియున్నాడు.

క్రీ॥ శ॥ 1944 సం॥రమునకు విక్రమశకం 2000న్నూ కలిశకం 5044 సం॥రములున్నూ అగును. కలి 5044 నుండి విక్రమశక సం॥ 2000 మినహాయించగా 3044 కలి సం॥రమున విక్రమశక ప్రారంభమైనది. కలి 3068లో "జ్యోతిర్విదాభరణము"ను కాళిదాసు వ్రాసినానని చెప్పియున్నందున (3068-3044=24) విక్రమశకం 24సం॥లో అనగా క్రీ॥ పూ॥ (57-24)=33 సం॥రములో జ్యోతిర్విదాభరణము వ్రాయబడినదని స్పష్టపడుచున్నది. ఇందు కలిశకములో 3068 సం॥రములు వెళ్లినపిమ్మట వైశాఖ మాసములో గ్రంథప్రారంభము చేయబడినట్లు స్పష్టముగా చెప్పబడియుండుటవలన యీ కాలమును మన మవశ్య మంగీకరింపవలసియున్నది. గనుక వరాహమిహిరాదులు క్రీ॥ పూ॥ 57 సం॥ ర॥ 33 వ సం॥ల మధ్యమందున్నటుల స్పష్టపడుచున్నది. ఈ కాలనిర్ణయము విషయమున "ఆల్బెరూని" పండితుడు శకకాలమును శాలివాహన శకముగా భ్రమించి సిద్ధాంతములను తారుమారుచేసిన పండితులవలన తెలిసికొనియున్నందున వరాహమిహిరుడు తన కాలమునకు ముందు 526 సం॥రముల క్రిందట అనగా క్రీ॥ శ॥ 504 సం॥ రమున నున్నటుల వ్రాసియున్నాడు. ఇది భ్రాంతిజనకమై యున్నందున అంగీకరింపతగినది కాదు. పారశీక శక సం॥రం క్రీ॥ పూ॥ 550-33=517 శక సం॥ రములు గడచినపిమ్మట (క్రీ॥ పూ॥ 33 సం॥రం జ్యోతిర్విదాభరణం వ్రాయబడినటుల స్పష్టము. ఆకాలముననె వరాహమిహిరాది నవరత్నములు విక్రమార్కు నాస్థానమున నుండిరి. జ్యోతిర్విదాభరణమును రచించిన కాళిదాసుగాక వేరొక కాళిదాసు "భోజరాజు" ఆస్థానమునందు గలడు. జ్యోతిర్విదాభరణమును వ్రాసిన కాళిదాసుని ప్రథము కాళిదాసనియు, భోజరాజు ఆస్థానములోని కాళిదాసును ద్వితీయ కాళిదాసనియు మనము గుర్తింపవచ్చును. వరాహమిహిరునిచే వ్రాయబడిన గ్రంథములలో అర్యభటీయమునుండి ప్రమాణములను గ్రహించియున్నాడు. ఆర్యభట్టునియొక్క ప్రశంస చేయబడినందున వరాహమిహిరునికంటె ఆర్యభట్టు పూర్వుడని దృఢపడుచున్నది.

వరాహమిహిరుడు క్రీ. పూ. 57 రములోనుండి యున్నటుల పైన ఋజువుపరచియుంటిమి. వరాహమిహిరుడు పంచసిద్ధాంతికను శక నృపకాలము 427 సంవత్సరమున రచియించినటుల కొందరు చెప్పుచు బంచసిద్ధాంతికలోని యీ క్రింది శ్లోక మాధార మనుచున్నారు.

శ్లో॥ "సప్తాశ్వివేద సంఖ్యం శకకాలమపాస్య చైత్రశుక్లాదౌ
అర్ధాస్తమితే భానౌయవనపురే సోమదివసాద్యే ॥"

(పంచసిద్ధాంతిక 1. 8.)

వరాహమిహిరుడు అహర్గణితమును జేయు విధమును జెప్పు సందర్భమున జరుగుచుండు శకకాల సంవత్సరములనుండి 427 మినహాయించి పైశ్లోకములయందు నిర్వచింపబడిన విధమున గణితము సేయుమని చెప్పియుండెను, దీనినిబట్టి వరామిహిరుడు గణితము సేయునప్పటికి శకకాలము 427 సంవత్సరములు గడిచియుండెననియు నపుడే యీ గ్రంథమును రచించియుండెననియు జెప్పుచు నాశకకాలము శాలివాహనశకమని జెప్పి (427 + 78=505 సం॥) క్రీ. శకము ప్రకారం 505 సంవత్సరములో వరాహమిహిరుడున్నటుల నిర్ణయించి యుండిరి, అట్లయిన విక్రమార్కుని యాస్థానమందు క్రీ॥ పూ 57 సం॥రమందుండిన వరాహమిహిరుడు చెప్పిన 427ను శకనృపకాలము క్రీ॥ పూ॥ 550 నుండి తగ్గించిన యెడల క్రీ. పూ 123 సం॥రమున పంచసిద్ధాంతికను రచించియుండెనని చెప్పుటయే యెక్కువ ఖచితముగా జేయబడిన కాలనిర్ణయమగును. కాని సిమ్మట క్రీ. శ. 78 లో రాబడిన శాలివాహన శకమున కంటగట్టి వరాహమిహిరుని కాలమును ఆరు శతాబ్దములు పై చిల్లరకాలమున కీవలకు తెచ్చుట సమంజసము కానేరదు. గనుక వరాహమిహిరుడు క్రీ. పూర్వమందుననే విక్రమార్కుని యాస్థానములోనివాడనియే స్పష్టపడుచున్నది. ఇందుకు వ్యతిరేకముగా జేయబడిన విమర్శనలు నిర్ణయములు సరియైనవి కానేరవు.

## భట్టోత్పలుని కాలప్రశంస

వరాహమిహిరునిచే రచింపబడిన "బృహత్సంహిత" యను సిద్ధాంత గ్రంథమునకు 'భట్టోత్పలుడు' 'చింతామణి' యను పేరున వివృత్తిని వ్రాసియుండెను. అందు 'శాకే 888 సం॥రం చైత్ర శుక్ల పంచమి గురువారమునాడు రచించినట్టు వ్రాసియున్నాడు.

శ్లో॥ "చైత్రమాసస్య పంచమ్యాం సితాయాం గురువాసరే।
వస్వష్టాష్టమితే శాకే (888) కృతేయం వివృతిర్మయా॥"

భట్టోత్పలుడు తన వివృతియందు కల్యాణవర్మ, బ్రహ్మగుప్తుడు, మంజులగుప్తుడు, మొదలైన సిద్ధాంతుల పేర్కొనియుండెను. దీనిని బట్టి వారందరును భట్టోత్పలునికి పూర్వమునందుండినవారని స్పష్ట పడుచున్నది. శాకే (౫౫౦) సం॥రం అనగా క్రీ॥ పూ॥ 550 సం॥ రమున ప్రారంభింపబడిన శకసంవత్సరముగా లెఖజూచిన (888-550= 330 సం॥రమున భట్టోత్పలుడు వివృతిని వ్రాసినటుల తెలియుచున్నది. ఇది పాశ్చాత్యవిద్వాంసులు వరాహమిహిరుని కాలము క్రీ॥ శ॥ ఆరవ శతాబ్దమని చేయబడిన నిర్ణయమునకు విరుద్ధముగా గనబడు చున్నందున "శాకే" యనుదానిని శాలివాహనశకమని అర్థముచేసి (888 + 78) = క్రీ॥ శ॥ 966 సం॥రమని నిర్ధారణ జేసిరి. కాని వారి వాదమునకొక చిక్కు తటస్థించినది, భట్టోత్పలుడు తానుశాకే 888 సం॥ చైత్ర శుక్లపంచమి గురువాసరమున 'చింతామణి' యను పేరున వివృతిని రచించినట్లు చెప్పియుండెను. క్రీ॥ శ 966 సం॥రము నందలి చైత్రశుక్ల బంచమితిథి గురువాసరము కాదయ్యెను. ఈ ఘోరవిపత్తునుండి తప్పించుకొనుటకు పాశ్చాత్యమానన పుత్రులైన మహామహోపాధ్యాయ సుధాకర ద్వివేదియను పండితు డా శ్లోక పాఠమునే తమ కనుగుణ్యముగా నుండునట్లు మాసమును, పక్షమును, తిథిని మార్పుచేసి గురువాసరమునకు సరిపుచ్చుకొని మార్పుచేసి యుండిరి, వారిచే మార్చి వ్రాయబడిన శ్లోకపాఠమీాదిగువ వ్రాయ బడినది.

శ్లో॥ "ఫాల్గుణస్య ద్వితీయాయామ సితాయాం గురౌర్దినే।
వస్వస్వాష్టమితే శాకే కృతేయం వివృతిర్మయా॥"

అని దిద్ది వ్రాసియుండిరి.

(సుధాకర ద్వివేదీ కృతగణకతరంగిణి 22 పేజీ)

ఆధునిక పండితులు పాశ్చాత్యపండితుల యడుగుజాడల నను సరించుటయేగాక పూర్వశాస్త్రకర్తలు వ్రాసినవాటిని తప్పులని ప్రచారముచేయుట యటుండ తమ యజ్ఞానమును, అసమర్థతను గప్పి పుచ్చుకొనుటకు ప్రాచీన గ్రంథములను తమరుచి కనుకూల ముగాదిద్ద సాహసించినందుకు విచారింపవలసియున్నది. ఇది మహా ఘోరాపరాధము. ఇంతకు భట్టోత్పలుడు సూచించినశాకే 'యను నది క్రీ॥ పూ॥ 550 సం॥రమున యేర్పడిన శకనృపకాలముగా తీసి కొనిన క్రీ. శ. 338 సం॥రమగుచు. ఆ సం॥రమున చైత్రశుక్ల పంచమి గురువారము సరిపోవుచున్నది. "శంకరుని కాలము" (Age of Sankara)అను గ్రంథమును రచించిన టి. యస్. నారాయణశాస్త్రి వరాహూరు సుందరేశ్వరశాస్త్రి మొదలయిన యనేక సిద్ధాంతులు గణితమువేసి క్రీ. శ. 338 సం॥రములో చైత్రశుక్లపంచమి గురువాసర మైనట్లు చెప్పియుండిరి. బెజవాడ కాపరస్తులు శ్రీ రాళ్ళబండి సత్య నారాయణశాస్త్రి సిద్ధాంతిగారిచే యీ గ్రంథకర్తగారు గణితము చేయించగా చైత్రశుక్ల పంచమి గురువారముకు క్రీ॥ శ 338 సం॥ర ములో సరిపోయినది, గనుక భట్టోత్పలునిచే చెప్పబడిన శకకాలము క్రీ॥ పూ॥ 550 లో శకసామ్రాజ్యస్థాపన కాలమున (పారశీక సామ్రాజ్యస్థాపన కాలమున సైరసుద్రేటు అను రాజుచే) యేర్పరుప బడినదిన్ని పండితులచే క్రీ॥ పూ॥ 550 సం॥రముసుండి వాడబడిన దిన్ని అయిన శకసం॥రమని తెలియవలెను.

భట్టోత్పలుని 'చింతామణి' గ్రంథమును బాపుదేవశాస్త్రి గారు ప్రచురించియుండిరి. అందిశ్లోకమును "చైత్రమాసస్య పంచ మ్యాంసితాయాం గురువాసరే" యనియే ప్రచురింపబడినది,

బొంబాయిలో నాగరలిపితోడను, చెన్నపురియందు దెలుగులిపితోడను ప్రకటింపబడిన 'చింతామణి' గ్రంథములయందును పైశ్లోకమావిధముగనే ప్రచురింపబడినది. కాని తమ వాదమున కనుకూలముగా నుండుటకు 'సుధాకర ద్వివేదిపండితుడు' ప్రథమపాదమును తన కనుకూలముగా నుండునటులమార్చి "ఫాల్గుణస్య ద్వితీయాయామసితాయాం గురార్దినే" యని తమ గణకతరంగిణి 22 పుటలో ప్రచురించియుండిరి.

## భాస్కరాచార్యుల కాలప్రశంస

భాస్కరాచార్యులు మహేశ్వరోపాధ్యాయుల (మహాదేవుని) కుమారుడు ఈయన ౧. సిద్ధాంతశిరోమణి ౨. కర్ణకుతూహలము 3. లీలావతి గణితము ౪. బీజగణితము మున్నగు గ్రంథముల రచించియుండెను.

ఈయన తన సిద్ధాంత శిరోమణిగోళాధ్యాయములో తన వయస్సును తాను సిద్ధాంతశిరోమణి యను గ్రంథమును వ్రాసినకాలమును చెప్పుకొనియున్నాడు.

శ్లో॥ "రసగుణపూర్ణ (1036) మహీసమశక నృపసవయే
ఽభవన్మమోత్పత్తిః।
రసగుణవర్షేణ (36) మయా సిద్ధాంత శిరోమణీరచితః॥"

తా, శకనృపకాలము ౧౦3౬వ సం॥రమున దాను జన్మించినట్లును దనకు 36వ సం॥రము వయసున 'సిద్ధాంతశిరోమణి గ్రంథమును రచించినట్లును చెప్పుకొనియుండెను. గనుక సిద్ధాంతశిరోమణి గ్రంథము ౧౦౭౨ శక సం॥రమున రచింపబడినట్లు దెలియుచున్నది. ఇందు జెప్పబడిన శకనృపకాలము శాలివాహన శకమున కంటగట్టి భాస్కరుడు క్రీ॥ శ॥ 1114 సం॥రమునందు జన్మించినటులను క్రీ॥ శ॥ 1150 సం॥రమున సిద్ధాంతశిరోమణి వ్రాయబడినట్లును క్రీ॥ శ॥ 1183 సం॥రమున కర్ణకుతూహలము వ్రాయబడినట్లును పాశ్చాత్యపండితులును వారిశిష్యులగు హైందవపండితులును వ్రాసియుండిరి. పాశ్చాత్య

పండితుల సిద్ధాంతము ననుసరించి భాస్కరుని జననమైన 1114 సం॥రమునకుముందు యెనుబదినాలుగు సం॥రముల క్రిందటనే అనగా క్రీ॥ శ॥ 1030లో హిందూదేశమం దుండిన "ఆల్బెరూని" పండితుడు మహాదేవుని కుమారుడైన భాస్కరాచార్యునిచే రచింపబడిన కర్ణ సారలేక "కర్ణకుతూహల" మను గ్రంథము తమదేశములో తొమ్మిదవ శతాబ్ద ప్రారంభముననే (క్రీ॥ శ॥ 899 సం॥రములోనే) ప్రచార ములో నుండినటుల చెప్పియుండెను. ఆల్బెరూని ఇండియా అను గ్రంథము ఇంగ్లీషుతర్జుమాలో భదత్తునికుమార్డు విత్తేశ్వరుడనిఅర బిక్కులో భాస్కరుడని వ్రాయబడిన మాటకు తప్పగా యుచ్చారణ కల్పించి తమచే భాస్కరుకు క్రీ॥ శ॥ 1114 సం॥రమని చేయుబడిన నిర్ణ యమునకు భంగములేకుండునట్లు పేర్లు తారుమారుచేసి యుండిరి. దీనివలన పాశ్చాత్య పండితులచే భాస్కరుని జన్మకాలమని చెప్ప బడిన కాలమునకు 284 సం॥రములకు ముందే భాస్కరునిచే వ్రాయ బడిన 'కర్ణకుతూహల గ్రంథము ప్రచారమునం దుండెనని స్పష్టపడు చున్నది. దీనినిబట్టి భాస్కరునిచే జెప్పబడిన శకనృపకాలము శాలి వాహన శకముకాదని స్పష్టముగా దెలియుచున్నది, ఈ వివరము తెలియనందువలన గుర్కి ద్రిప్పుకొనలేక పాశ్చాత్యపండితుడైన "వెబరు" కర్ణకుతూహల గ్రంథకర్తయైన భాస్కరుడును సిద్ధాంత శిరోమణి గ్రంథకర్తయైన భాస్కరుడును వేరువేరు వ్యక్తులని చెప్పు టకంటె గత్యంతరము గుపడలేదనియు, అటులనే అందరంగీకరింప వచ్చుననియు జెప్పియుండిరి. (Weber's History of Indian Literature P. 262) వెబరుపండితుని వాక్యముల నీక్రింది యుదాహరించు చుంటిమి.

"After Varaha-mihira and Brahmagupta various other astronomers distinguished themselves. Of these, the most eminent is Bhaskara, to the question of whose age, however, a peculiar difficulty attaches. According to his own account, he was born Shaka 1036 (A. D. 1114) and completed the siddanta Siromani Shaka 1072 (A. D. 1150), and the Karnakutuhala Shaka

1105 (A. D. 1183); and with this the modern astronomers agree, who assign to him the date Shaka 1072 (A. D. 1150). but Alberuni, who wrote in A. D. 1031 (that is 83 years betore Bhaskar a's birth) not merely, mentiones him but places his work here called karna-Sara, 132 years earlier, namely in A. D. 899; so that there is a discrapancy of 284 years between the two accounts. I confess my inability to solve the riddle; so close is the coincidence as to the personage that the Bhaskar of Alberuni is expressly described, like the real Bhaskara, as the son of Mahadeva. But notwithstanding this, we have scarcely any alternative save to seperate Alberuni's Bhaskara, son of Mahadev, the author of karna Sara from Bhaskara, son of Mahadeva, the auther of the Karnakuthuhala more especially as, in addition to the discrepancy of date, there is peculiar circumstance that where as Alberuni usually represents the Indian bh, by buh (eg.) b-buj = bhurja, balb-hadr = Balabhadra, and for the most part faithfully preserves the length of the vowels, neither of these is here done in the case of Bhaskara, where' morever, the "S" is changed into "sh."

(Weber's History of Indian Litt. P 261, 262 Ed 1878)

శకకాలము, శకేంద్రకాలము, శకనృపకాలము, శకభూపకాలమునని పేర్కొనబడిన శకమొక్కటేననియు, అది పారశీక దేశమున శకసామ్రాజ్యమును స్థాపించిన సైరసు దిగ్రేటు (Cirus the Great) అను వానిచే యుధిష్ఠిరకాల 2526 సం॥ లేక క్రీ॥ పూ॥ 550 సం॥రమునుండి యేర్పడిన శక కాలమైయున్నది. దీనిని మరచి పిమ్మట క్రీ.శ. 78 సం॥మున యేర్పడిన శాలివాహన శకమని భ్రమించి లెక్కించినందువలననే భాస్కరుడు 1036 + 78 = క్రీ॥ శ॥ 1114 సం॥రములో నున్నటుల సిద్ధాంతీకరింపబడుటయేగాక అల్బెరూనిచే వ్రాయబడిన చరిత్ర యింగ్లీషు తర్జుమాలో అరబికు భాస్కరునికి విత్తేశ్వరుడనియు భాస్కరునితండ్రి మహేశ్వరునికి భదత్తుడనియు మార్చియుండినటుల స్పష్టముగా దెలియుచున్నది. అరబిక్కు భాస్కరుని పేరు నింకొకవిధ

ముగా నుచ్చరించుట కవకాశములేనటుల ఆరబిక్కుభాషలో స్పష్ట ముగా నున్నటుల పైన వెబరుమహాశయుని వాక్యములే జెప్పు చున్నవి.

భాస్కరుడు (౧౦౩౬-౫౫౦=) ౪౮౬ సంవత్సరములో జనన మొందెను. సిద్ధాంతశిరోమణి గ్రంథమును ఆయన ౩౬ వ. సంరము వయస్సున (అనగా క్రీ॥ శ 486 + 36 = 522) రచించియుండెను. కర్ణకుతూహలమను గ్రంధమును శకనృపకాలము 1105 సం॥రం లో రచించినట్లు చెప్పబడియుండుటచే (1105—550=555 క్రీ॥ శ॥ లో వ్రాయబడినట్లు స్పష్టపడుచున్నది. భాస్కరాచార్యులు తన సిద్ధాంత శిరోమణి కాలమానాధ్యాయము ౨౮ శ్లోకమున తనకాలమున వర్త మానమగుచుండిన కాలదినగణితమును గురించి చర్చించుచు—

శ్లో॥ "యాతాః షణ్మనవోయుగాని భమితాన్యన్యద్యుగాంఘ్రి
త్రయం ।
నందాద్రీందుగుణాశ్చ (౩౧౭౯) విక్రమనృపస్యాంతే
కలేర్వత్సరాః ॥
గోద్రీందవద్రికృతాంకదస్రనగగోచంద్రాః(197.29,47,179)
శకాబ్దాన్వితాః ।
సర్వేసంకలితాః పితామహదినేస్యుః వర్తమానేగతాః"॥

తా. ఆరుగురు మనువులు 27 మహాయుగములు 28 వ, మహా యుగములో కృతాది మూడు యుగములున్నూ కలియుగములో ౩౧౭౯ సంవత్సరములున్నూ విక్రమ నృపాంతమునకు గతించినవి, 197,29,47,179 సంవత్సరములకు మిగిలిన విక్రమశతాబ్దములు (అనగా కలి 5044 కు (విక్రమశకాబ్దములు 2000—135=) 1865 కలిపిన బ్రహ్మకు ఉషఃకాలమునుండి యిప్పటికి అనగా కలి 5044 సం॥కు (1944 సం॥రముకు) 197,29,49,044 సం॥రములు గడచినది. (ఇందులో బ్రహ్మధ్యానకాలము 1,70,64,000 సం॥రములు మినహా యించగా 195,58,85,044 సృష్ట్యాదికాలము వచ్చును.)

కలి 3179 వ, సం॥రమున విక్రమన్నృపు డంత మొందెను. క్రీస్తుశకము ప్రకారము క్రీస్తుకుపూర్వము 57 వ, సం॥మున విక్రమశక ప్రారంభము. క్రీస్తుకు పిమ్మట 78 వ, సం॥రములో విక్రమన్నృపాంతము గనుక విక్రమశకములో (57 + 78=) 135 వ, సం॥రము కలిలో 3179 సం॥రముకు సమానము, అనగా కలి 3179—135= 3044 సం॥రమున విక్రమశకము ప్రారంభమైయున్నది. క్రీ. శ, 1944 సం॥రముకు విక్రమశకము 2000 గడచినది. కలి 3044 + విక్రమశకం 2000 కలుపగా కలి 5044 సం॥రం వచ్చుచున్నది. లేక కలి 3179 సం॥రములకు విక్రమాంతమునుండి యిప్పటికి గడిచిన (2000—135=) 1865 సం॥రములు కలిపిన కలి 5044 వచ్చుచున్నది

౧. శ్లో॥ "యదాయుధిష్ఠిరో రాజా శక్రప్రస్థే ప్రతిష్ఠితః।
తదాస ప్తర్షయః ప్రాపుర్మఘాః పితృహితేరతాః॥

౨. ,, పంచసప్తతివర్షాణి ప్రాక్కలేః సప్తతేద్విజాః।
మఘాస్వాసన్ మహారాజే శాసత్యుర్వీం యుధిష్ఠిరే।

౩. ,, పంచవింశతివర్షేషు గతేష్వథ కలౌయుగే।
సమాశ్రయిష్యన్త్యాశ్లేషాం మునయస్తే శతంసమాః॥

౪. ,, తద్దైవధర్మపుత్రేఽపి మహాప్రస్థానమాస్థితః।
భువం పరిభ్రమన్నంతే స్వర్గమారోక్ష్యతి ధ్రువమ్॥

౫. ,, తద్దైవలౌకికాబ్దేపి సప్తవింశ శతాత్మకః।
ధర్మపుత్రే జ్ఞానకార్థం లోకేతాఽత్ ప్రవర్తితః॥

౧. తా॥ శక్రప్రస్థమున యుధిష్ఠిరు డభిషిక్తుడైనపుడు సప్తర్షులు పితృహితములగు మఘానక్షత్రమును బ్రాపుచేసుకొని సంచరించుచుండిరి.

౨. కలియుగప్రవేశమునకు 75 సం॥రముల పూర్వము సప్తర్షులు మఖానక్షత్రమున బ్రవేశించిరి. సప్తర్షులు మఖయందుండిన కాలమున యుధిష్ఠిరుడు రాజ్యమును బాలించెను. (సప్తర్షులు క్రీ॥ పూ॥ 3177

(3102+75) సంవత్సరమున మఖా నక్షత్రమున ప్రవేశించినట్లు గనుపట్టుచున్నది.)

3. కలియుగములో 25 సం॥రములు గడచినపిదప సప్తర్షులాశ్లేషా నక్షత్రముంజేరి నూరు సంవత్సరములుందురు.

౪. శ్లో॥ ధర్మజుడు భూప్రదక్షిణము గావించి సప్తర్షులు మఖా నక్షత్రమును విడిచి యాశ్లేషా నక్షత్రమును జేరినకాలమునందే స్వర్గారోహణము గావించును ఇది నిశ్చయము. (యుధిష్ఠిరుడు అనగా ధర్మరాజు స్వర్గస్థుడగుట (కలి 26 సం॥రం) క్రీ॥ పూ॥ 3076 సం॥ మగుచున్నది.)

౫. ,, అపుడు లోకమునందు ధర్మజుని (యుధిష్ఠిరుని) జ్ఞాపకార్థమిరువదియేడువందల వత్సరముల కాలపరిమాణముగల లౌకికాబ్దమేర్పాటు కాబడి తదాది ప్రచారములో నుండును.

(దీనినిబట్టి లౌకికాబ్ద ప్రారంభకాలము క్రీ॥ పూ॥ 3076 వ సంవత్సరమైనటుల తెలియుచున్నది. (కలియుగ రాజ వృత్తాంతం 3 వ అధ్యాయం) పైన చెప్పబడిన మూడవశ్లోకములో సప్తర్షులు మఖ నుండి ఆశ్లేషకు వచ్చెదరని చెప్పబడియుండుటవలన సప్తర్షులు వెనుకకు తిరుగుచున్నటుల (Ratrograde motion) కొందరుచెప్పుచున్నారు. ఈ విషయమున జ్యోతిస్సిద్ధాంత గ్రంథము లేకీభవించుట లేదు. సప్తర్షి మండలం సవ్యముగానే తిరుగుచున్నట్లు ప్రమాణవాక్యములీ భాగములోని ''సప్తర్షి మండలము'' అను విషయము వ్రాయబడిన చోట చర్చింపబడినది.

(సప్తర్షి మండలము సవ్యముగా తిరుగుచున్నదని కొందరును, అపసవ్యముగా తిరుగునని కొందరును, అసలు తిరుగనే తిరుగదని కొందరును అభిప్రాయ పడుచున్నారు. జ్యోతిస్సిద్ధాంత గ్రంథప్రమాణములు దొరుకువరకు సవ్యముగా తిరుగుచున్నటులనే యెంచబడవలయునుగాని కేవలమొక చరిత్రగ్రంథము చెప్పినమాత్రము చాలదని తోచుచున్నది.)

ఏది యెట్లున్నను సప్తర్షిమండలము కలి పూర్వము మఖా నక్షత్రమున ప్రవేశించినది. కలి 25 సంవత్సరమున మఖా నక్షత్రమును దాటి కలి 26 సం॥రమున తరువాత నక్షత్రమున ప్రవేశించినది, ఆ సమయమున అనగా కలి 26 వ సం॥రమునుండి "లోకకాల" మను పేరున నొకశకము యుధిష్ఠిరుని జ్ఞాపకార్థము లోకులచే (అనగా ప్రజలచే) ప్రవర్తింపజేయబడినది. దీనినే "యుధిష్ఠిర కాలము"నియు, "లోక కాలమునియు" పేర్కొనియుండిరి. వరాహమిహిరుడు బృహత్సంహితయందు దిగువ విధమున జెప్పియున్నాడు.

శ్లో॥ ఆసన్ మఘాసుమునయః శాసతిపృథ్వీం యుధిష్ఠిరే నృపతౌ।
షడ్ద్వికపంచద్వియుత (2526) శ్శకకాలః తస్యరాజ్ఞశ్చ॥"
(బృహత్సంహిత ౧3 వ అధ్యాయం 3 వ శ్లో।)

తా॥ యుధిష్ఠిర మహారాజు భూమిని పాలించుచుండిన కాలమున సప్తర్షులు మఖా నక్షత్రమునందుండిరి. 2526 సం॥రములు "శకకాలమునకు" కలిపిన ఆ రాజుయొక్క (కాలము) వచ్చును. అనగా యుధిష్ఠిరకాలము లేక లౌకికకాలము వచ్చునని చెప్పబడినది. దీనిని బట్టి యుధిష్ఠిరకాలము లేక లోకకాలము 2526 సంవత్సరములు జరిగిన పిమ్మట శకకాలమనునదొకటి ప్రవర్తించి యుండినటుల తెలియుచున్నది. లోకకాలము లేక యుధిష్ఠిరకాలము అనెడి శకము క్రీ॥ పూ. 3076 వ సం॥రము (కలిశకము క్రీ॥ పూ॥ 3102--26=3076)న ప్రారంభమైనది. క్రీ॥ పూ॥ 3076 నుండి 2526 సం॥రములు తీసివేయగా క్రీ॥ పూ॥ 550 సం॥రమున "శకకాలము ప్రారంభింపబడినటుల స్పష్టపడుచున్నది. బృహత్సంహితయందు వరామిహిరునిచే జెప్పబడిన దీ శకమైయున్నది. దీనిని శకకాలము, శకనృపకాలము, శకభూపకాలము శకేంద్రకాలమునని పేర్లు వాడబడినవి. ఆ కాలమునకు శాలివాహనశక మింకను ప్రవర్తితము కానేలేదు. శకకాలమునకుపిమ్మట 628 సం॥రములకు శాలివాహనశకము ప్రవర్తితమైనది. ఇటీవలివారు లోగడ సిద్ధాంతులచే వాడబడిన శకకాలము శాలివాహన శకమని

భ్రమించి శకకాలమును తలక్రిందులు చేయుటవలన సిద్ధాంతుల కాలములును, రాజుల కాలములును తారుమారైనవి. ఈ పొరబాటు సుమారు వేయిసం॥ముల క్రిందటినుండియు సిద్ధాంతులలోనే ప్రారంభమైనటుల గన్పట్టుచున్నది. పైరసు దిగ్రేటు శకము కొంత కాలమునకు మరువబడుటయు శాలివాహన శకముగూడను శకకాలమను పేరున యుపయోగములోనికి వచ్చుటయు, ఈ పొరబాటునకు కారణములు. ఇందు విషయమున సిద్ధాంతులు హెచ్చు పరిశోధనలు చేయవలసియున్నది.

పైన యుదహరింపబడిన "ఆసన్ మఘాసుమునయః" అను శ్లోకమునకు భట్టోత్పలుడు చింతామణియను పేరున తాను వ్రాసిన వివృతియం దీ విధముగా వ్యాఖ్యానించియున్నాడు.

వ్యాఖ్య:- "మునయో మరీచ్యాదయః సప్తఋషయో- యుధిష్ఠిరే పాండుతనయే నృపతౌ రాజని పృథ్వీంమహీం- శాసతి పరిపాలయతి-మఘాసు- మఘానక్షత్రే ష్వాసన్నధ్య తిష్ఠన్"- తదాచ వృద్ధగర్గః

"కలి ద్వాపరసంధౌతు స్థితాస్తే పితృదైవతమ్ మునయో ధర్మనిరతాః ప్రజానాం పాలనేరతాః తస్యచ యుధిష్ఠిరస్యరాజ్ఞః షడ్వింశ పంచద్వియుతః శకకాలోగతః సహస్రద్వయేన పంచభిః శతైః షడ్వింశత్యధికైః ౨౫౨౬ శకనృపకాలో యుక్తః కార్యః। ఏవంకృతే యద్భవతి తావద్వర్ష బృందం వర్తమానకాలం యావద్గతం. తస్యచ శతేన భాగమాహృత్య యదవాప్యతే తాని నక్షత్రాణి మఘాదీని భుక్తాని యచ్ఛేషంతాని వర్షాణి భుజ్యమానే నక్షత్రే తేషాం ప్రవిష్టానాం గతాని, తానిచ శతాద్విశోధ్య యదవశిష్యతే తావన్త్యేవ వర్షాణి తస్మిన్నక్షత్రే స్థితాసీతి। లబ్ధనక్షత్రాణామపి సప్తవింశత్యా భాగమపాహృత్య ఽవశేషాంక సమం మఘాది నక్షత్రం భుక్తమితి వాచ్యం."

పై వ్యాఖ్యానములో 'శకకాలః' అనుదానికి 'శకనృపకాలః' అని అర్థము వ్రాయబడినది. శకులనగా పారశీకులు, శకనృపుడన పారశీకులకు రాజు. (యితనే సైరసు ది గ్రేటు)శకనృపకాలమన పారశీకుల రాజుయొక్క కాలము (అనగా శకము). దీనిని శక కాలమనియు, శక నృపకాలమనియు, శక భూపకాలమనియు, శకేంద్ర కాలమనియు సిద్ధాంత గ్రంథములలో వాడబడినది. శాలివాహన శకమునుగూడను శకకాలమని బిలిచియుండిరిగాని శక నృప వగైరా పేర్లు దానికి లేవు. శాలివాహనుడు భారతీయులకు రాజుగాని శకులకు రాజుగాడు. అందువలన శకనృపకాలమని పిలచుటపొసగదు. శాలివాహనుడు శకులను జయించి యీ దేశమునుండి తరిమివేసిన వాడుగాని వారిని పరిపాలించినవాడుకాదు॥ వానికి శకారి, శకాంతక యను బిరుదు చెల్లునుగాని శకనృప యన చెల్లదు. గనుక శకనృప కాలమన శకులకు రాజైన పారశీకరాజు కాలమనుటకెట్టి యాక్షేపమును లేదు. భట్టోత్పలుని పైవివృతియందు శకకాలమన శకనృప కాలమని స్పష్టముచేసి యున్నందున యుధిష్ఠిరకాలము లేక లోక కాలము 2526 సం॥రములు జరిగినపిమ్మట యేర్పడిన శకనృపకాలము యిప్పటికి (అనగా లోకకాలము 5020 కి. లేక క్రీ॥ శ॥ 1944 సం॥ రమునకు) 2494 సం॥రములు జరిగియున్నది. (2526 + 2494 = 5020) శకనృపకాలము 2494 — క్రీ॥ శ॥ 1944 మినహాయించగా క్రీ॥ పూ॥ 550 సం॥రములు వచ్చును. ఇదే శకనృపకాల ప్రారంభము. సిద్ధాంత గ్రంథములలో యీ శకనృపకాలమే వాడబడియున్నది. గనుక దీనిని బట్టియే సిద్ధాంతుల కాలములను సరిచూచుకోవలెను.

సారాంశమేమన:—

| | |
|---|---|
| భాస్కరాచార్యులు జననం | క్రీ॥ శ॥—486 |
| సిద్ధాంతశిరోమణి గ్రంథరచన | ,, —522 |
| కర్ణకుతూహల గ్రంథరచన | ,, —555 |

అని ధృవపడుచున్నది.

వరాహమిహిరుని బృహత్సంహిత, 8 అధ్యా. 20, 21 శ్లో॥

శ్లో॥ గతానివర్షాణి శకేంద్రకాలాద్ధతానిరుద్రైర్గుణ మేచ్చతుర్భిః।
నవాష్ట-పంచాష్ట-యుతానికృత్వా విభాజయేచ్చూన్య
శరాగరాభైః। ౨౦

,, లబ్ధేనయుక్తం శకభూపకాలం సంశోధ్యషష్ట్యా విషయైర్విభజ్య।
యుగాని నారాయణ పూర్వకాణి లబ్ధానిశేషాః క్రమశః
సమాస్యుః॥ ౨౧

పై రెండు శ్లోకములలోని మొదటి శ్లోకములో "శకేంద్ర కాల"మనియు రెండవ శ్లోకములో "శకభూపకాల"మనియు వరాహమిహిరు డుపయోగించియున్నాడు. ఇది శకులకు రాజైన సైరసు ది గ్రేటు అనువానితో సంబంధించిన శకముగాని దానికి పిమ్మట 628 సం॥రములకు రాబడిన "శాలివాహనశకము" కాదు దానికి దీనికి నెట్టిసంబంధము లేదు. శకేంద్రకాలము కలి 2550 సం॥రములో ప్రారంభింపబడినది, లేక లౌకికాబ్దము 2526 సం॥రములో ప్రారంభము. లేక క్రీస్తుశకము ప్రకారం క్రీస్తుకు పూర్వము 550 సం॥ములో ప్రారంభము. అట్లుగాక పారశీక శకమును వదలి శాలివాహన శకముగా గ్రహించిన 2526 + శాలివాహనశకం 1865 కలుపగా=4391 వచ్చును. ఆ కాలమును ధర్మరాజు రాజ్యము చేయుచున్నట్లెవరును అంగీకరించరు. యుధిష్ఠిరకాలము లేక లోకకాలము కలి 26 లో ప్రారంభమైనది. అప్పుడు యుధిష్ఠిరుడు స్వర్గారోహణ మొనర్చి యుండెను. కనుక పారశీక శకము 2494+2526=5020 యుధిష్ఠిర కాలమునకు సరిపోవుచున్నది. కనుక శాకే యనునది పారశీక శకం. క్రీ॥ పూ॥ 550 అని యెంచవలెను.

ఈ విషయమునె "The Astrological magazine Vol. 36 No. 4 April 1947." Page 278 లో యిట్లుదాహరింపబడినది.

Chronology of Indian Astronomers By
Prof:- P. S. S. Sastry. M. A. (Triple.)

BHASKARA:- He was as great a poet as a mathematician. The literary training of India alone could

produce such many sided geniuses, as Bhaskara, Bharthrihari (Poet, Grammarian and philosopher in one), Kalidas (Poet, and Astronomer in one) and many others. Bhaskara is the author of Lilavati, Bija Ganita, (Books on pure Mathematics), Siddhanta Siromani and Karna Kuthuhala, (Books on Astronomy). He himself has given the year of his birth and the "Saka Nrupa Samaya" referred to by him has been, in his case, interpreted as the Salivahana Saka as in other cases. Thus his date has been fixed as 1114 A. C. Scholars like Colebrooke, Max-muller and other European Scholars like Mac-Donel who were not proficient astronomers, have from the difficult and flowery style of Bhaskara, opined that he must have belonged to the 12th century, for the purely-literary scholars hold that style of Sanskrit becomes difficult as we proceed from antiquity to modern Era. But, the reference to Bhaskar by Alberuni shows that he was popular in the country as early as the ninth century. Considering the three prevailing difficulties e. g., absence of printing press, impediments to intercourse, etc., it must have taken the works of Bhaskar at least 200 years after their date of composition, to become popular. Thus, this is an impossibility to talk of Bhaskara's popularity in the 9 th century who was born in the 12 th century. Probably to avoid this absurdity, Prof. A. N. Singh, in his "History of Hindu Mathematics," holds that there were two Bhaskaras one belonging to 2 centuries earlier in the 9th century, and the other to the 12th. century. The reasons for mentioning two Bhaskaras whereas traditions have one, of course, are best known to the historians who do so But, if we assure the 'Saka Nrupa Samaya' of Bhaskara to mean the persian Shaka era, and keep due regard for genuine traditions, the date of Bhaskara falls on the year 486 A. C. This explains the apparent absurdity of Alberuni's reference to Bhaskar in the 9th century A. C. Summarising, I have found-out the following facts:—

Begining of Kaliyuga — 3102 B. c.

Date of Aryabhatta— 2762 B. c.
Date of Kalidas— 1st. century B. c.
Date ot Varahamihira— about 41 A. c.
Date of Bhaskara— 486 A. c.
Ayanamsa on 22-6-1946 = 23°-15-58 "nearly."

## జ్యోతిష సిద్ధాంతముల కాల నిర్ణయము

"ప్రాచీన జ్యోతిష సిద్ధాంతములనుబట్టి ఆ యాసిద్ధాంతము లెప్పుడేర్పడియుండెనో కనుగొనుట కేమేని యాధారములు దొరుకునేమో విమర్శింతము. "వరాహమిహిరుడు" పంచసిద్ధాంతిక యను సిద్ధాంత గ్రంథమును రచించియుండెను. అందు ప్రాచీన సిద్ధాంతములు పెక్కింటిలో ముఖ్యముగ నైదింటినిగురించి విపులముగ జెప్పియుండెను. ఆ యాసిద్ధాంతకర్త లా యాసిద్ధాంతముల జెప్పినప్పుడుగల వత్సర పరిమాణమును జెప్పియుండిరి. త్రేతాయుగాదిని రచింపబడిన సూర్యసిద్ధాంతమునకు వ్యాఖ్యను రచించుకాలమున సం॥ర పరిమాణం

దినములు—ఘడియలు—విఘడియ—పలలు—విపలలు
365 — 15 — 31 — 31 — 24

1. అనగా 365 రో. 6 గం. 12 నిము. 36-56 సెకండ్లకు సమానము.
2. పౌలిశ సిద్ధాంత కాలమున సంవత్సర పరిమాణము 365రో॥ల 6 గం. 12 నిముసములు
3. రోమక సిద్ధాంత(లేక రోమక) కాలమున 365 రో. 5 గం. 55 ని. 12 సెకండ్లు.
4. 5. అర్క జ్యోతిష, ఆర్య జ్యోతిష సిద్ధాంతముల కాలమున 365 రో. 5 గం, 50 ని. 36 సె.

క్రీ॥ శ॥ పదునెనిమిదవ శతాబ్దమునందుండిన ఫ్రెంచిదేశీయ విద్వాంసుడగు 'లాకైలి' (Mons. D. La-Caillee) పండితుడు గణితము వేసి తన కాలమున సంవత్సర పరిమాణము 365 రోజుల 5 గంటల 48 నిముసముల 43 సెకండ్ల కాలమైయుండెనని చెప్పియుండెను.

సంవత్సరముయొక్క కాలపరిమితి క్రమక్రమముగా క్షీణించుచుండునని ప్రాచీనాధునిక జ్యోతిషసిద్ధాంతులందరంగీకరించియుండిరి, ఇట్లు సంభవించు సంవత్సరక్షీణతను గణితమువేసిన 4900 సం॥రములకు 40.5 (40½) సెకండ్లకాలమగునని సిద్ధాంతవేత్తలుజెప్పియుండిరి. క్రీ॥ శ॥ పదునెనిమిదవ శతాబ్దాంతమున లాకైలీపండితుడు వేసిన సంవత్సర కాలపరిమాణముకంటె ఆర్యజ్యోతిష, అర్కజ్యోతిష సిద్ధాంత కాలములయందలి సంవత్సర పరిమాణము 1ని. 48 సెకండ్లకాల మధికమగును. రోమశసిద్ధాంత కాలమునందలి సంవత్సర పరిమాణము 6 నిముషముల 24 సెకండ్ల కాలమెక్కువగును. పౌలిశసిద్ధాంత కాలమందలి సంవత్సర పరిమాణము 23 ని. 12 సెకండ్లకాల మెక్కువగును సూర్యసిద్ధాంతమునకు వ్యాఖ్యరచింపబడిన కాలమునందలి సంవత్సరపరిమాణము 23 ని. 49 సెకండ్లకాల మెక్కువగనుండెను.

ఒకకాలమునందలి సం॥ర పరిమాణమునకును మఱియొక కాలమందలి సంవత్సర పరిమాణమునకును 40 1/2 సెకండ్లకాల వ్యత్యాసముండిన యీ రెండు కాలముల మధ్యనుండు కాలవ్యవధి 4900 సం॥రము లగును.

1. క్రీ॥ శ॥ 18వ శతాబ్దమున లాకైలీ కాలమునకును
2. ఆర్యజ్యోతిష, అర్కజ్యోతిష కాలమునకును

కల వ్యత్యాసము— (1 ని. 48 సె.) } $4900 \times \frac{2}{81} \times$ 1ని. 48 సె (లేక 108/1) = 13066 సం॥ 8 మాసములు

3. అట్లే లాకైలీకిని రోమశ సిద్ధాంత కాలమునకు మధ్యగలకాలవ్యవధి 6ని. 24 సె. } $4900 \times 2/81 \times 384$ సె. = 46,459 సం॥ 3మా. 3 1/3 రోజులు
4. పౌలిశసిద్ధాంత కాలమునకు మధ్యగల కాలవ్యవధి 23 ని. 12 సె. } $4900 \times 2/81 \times \frac{1392}{1}$ = 1,68,414 సం॥ 9మా. $23\frac{1}{3}$ రోజులు.

6. సూర్యసిద్ధాంతమునకు వ్యాఖ్య వ్రాయబడిన కాలమునకు మధ్యవ్యవధి 23 ని. 49 సెకండ్లు. } $4900 \times \frac{2}{81} \times \frac{1429}{1}$ =1,72,891 సం॥ రం 4 మా. 8$\frac{8}{9}$ రోజులు.

అగుచున్నది.

ఈ గణితమునుబట్టి లాౕకెలీ పండితునకుపూర్వము— 13,066 సంవత్సరములక్రిందట అర్క-జ్యోతిష, ఆర్యజ్యోతిష సిద్ధాంత మేర్పడిన కాలమనియు, లాౕకెలీ పండితునకు పూర్వము— 46,456 సంవత్సరములక్రిందట రోమశ సిద్ధాంత మేర్పడిన కాలమనియు, లాౕకెలీకి— 1,68,413 సంవత్సరములక్రిందట పౌలిశ సిద్ధాంత మేర్పడిన కాలమనియు లాౕకెలీకి—1,72,891 సం॥ రములక్రిందట సూర్యసిద్ధాంతమునకు వ్యాఖ్య రచింపబడిన కాలమనియు, ధృవపడుచున్నది. చూచితిరా! ప్రాచీన సిద్ధాంత వేత్తలచే రచింపబడిన సిద్ధాంత కాలము లాయావత్సరములని తేలుచుచే ప్రస్తుత సృష్ట్యారంభ కాలమిప్పటికి 1,73,000 సం॥రముల పై కాలమునకు బూర్వమైయుండునని స్పష్టముగ గన్పట్టుచున్నది.

"మఱియు యేల్ (yale) పట్టణమునగల విశ్వభారతీ స్థానమునందు పదార్థ విజ్ఞానశాస్త్ర కోవిదుడగు ఆలోయిస్ కోవరెక్ (Proff: Alois Kovarek) పండితుడు లోహాది ఖనిజ పదార్థముల యందుగల కిరణ ప్రసారముల శక్తినిబట్టి వానివాని యుత్పత్తికాల నిర్ణయములఁ గావించుచు యూరినైటు (Urinite) అను ఖనిజపదార్థముయొక్క యుత్పత్తి కాలనిర్ణయమును గావించుచు ప్రస్తుత ప్రపంచ సృష్టి యిప్పటికి షుమారు 1852 మిలియనుల వత్సరములక్రిందట అనగా 185, 20, 00,000 (నూటయెనుబదియైదు కోట్ల యిరువది లక్షల) సం॥రములక్రిందట జరిగియుండెనని యిటీవల జరిగిన కన్నెక్టికట్ (Connecticut) విద్వత్సభయందు సహేతుకముగను సాధ్య

శ్యముగను కనబఱిచి యుండినటుల చెప్పబడియుండెను. (The Hindu Illustrated weekly of 22 Feb. 1931 & 33).

ఇత్యాది ప్రాచీన హైందవసిద్ధాంత గణితములనుబట్టి ప్రస్తుత ప్రపంచసృష్టి యిప్పటికి 195 కోట్ల వత్సరముల పైకాలముక్రిందట జరిగియుండినటుల గన్పట్టు సిద్ధాంతమునే బలపరుచుచున్నది.

## యుగకాలనిర్ణయము

వి. గోపాలయ్యరుగారి సిద్ధాంతము.

ప్రాచీన హైందవ దేశచరిత్ర కాలనిర్ణయము (Chronology of Ancient India) ను రచించిన గోపాలయ్యరుగారు యుగకాల నిర్ణయమును గురించి యొకవిపరీత సిద్ధాంతమును వెలిబుచ్చియుండిరి. కలియుగప్రమాణము వేయి సం॥రములనియు, సంధ్య, సంధ్యాంశ ములు చేరి 1200 సం॥రములనియు క్రీ॥ పూ॥ 1177 సం॥ర చివర భాగములో రాబడిన దక్షిణాయనకాలమున కలియుగ ప్రారంభ మయ్యెననియు, క్రీ॥ పూ॥ 177 సం॥రముననో లేక క్రీ॥ శ॥ 25 సం॥ రముననో నంతమై యుండుననియు, నింత స్వల్పకాలమున కృత యుగము ప్రవేశమైయుండెనని యంగీకరించుటకు హైందవులకిష్టము లేక కలియుగ ప్రమాణముగ జెప్పబడిన 1200 సం॥రములు దేవ వర్షములని నిపుణతగ వ్యాఖ్యానముచేసి కలియుగ ప్రమాణమును 4,32,000 సం॥రములకు బెంచియుండిరని యూహించి జెప్పియుం డిరి. తమ విపరీత యూహాసిద్ధాంతమునకు వీరు మనుస్మృతి ప్రథమా ధ్యాయములోని

శ్లో॥ 'చతుర్యాహుస్సహస్రాణి వర్షాణాంతు కృతంయుగమ్।
తస్యతావచ్ఛతీ సంధ్యాసంధ్యాంశశ్చ తథావిధః॥'(౧-౬౯)
''ఇతరేషు ససంధ్యేషుససంధ్యాంశేషుచత్రిషు।
ఏకాపాయేనవర్తంతే సహస్రాణిశతానిచ॥'' (౧-౭౦)

అను శ్లోకము లాధారములని జెప్పియుండిరి. ఈ రెండుశ్లోకముల ననుసరించి కృత, త్రేత, ద్వాపర, కలియుగములు నాలుగును సంధ్య సంధ్యాంశలతో కలిసి క్రమముగా 4800, 3600, 2400, 1200 సం॥

రముల కాలపరిమాణము కలవని చెప్పబడుచున్నది. ఆ శ్లోకములకు పూర్వాపరములందుగల మనుస్మృతి ప్రథమాధ్యాయములోని 64 వ శ్లోకము మొదలు 73 వరకు గల శ్లోకములను 79 వ. శ్లోకమును కాల పరిమాణమును, గురించి చెప్పబడియున్నవి. వాని నీ దిగువనుఃుదహరించుచున్నాము.

శ్లో॥ "నిమేషాదశ చాష్టౌచకాష్ఠా త్రింశత్తుతాఃకలా।
త్రింశత్కలాముహూర్త స్స్యా దహోరాత్రంతు తావతః॥
(౧-౬౪)

,, అహోరాత్రే విభజతే సూర్యోమానుష దైవికే। [౧-౬౫
రాత్రి స్స్వప్నాయ భూతానాం చేష్టాయై కర్మణా మహః॥-

,, పిత్ర్యేరాత్ర్యహానీ మానః ప్రవిభాగస్తుపక్షయోః।
కర్మచేష్టాస్వహః కృష్ణః శుక్లస్స్వప్నాయశర్వరీ॥ (౧-౬౬)

,, దైవేరాత్ర్యహానీవర్షం ప్రవిభాగ స్తయోః పునః।
అహ స్తత్రో దగయనం రాత్రిస్స్యాద్దక్షిణాయనమ్॥ (౧-౬౭

,, బ్రాహ్మణస్యతు క్షపాహస్య యత్ప్రమాణం సమాసతః।
ఏకైకశోయుగానాంతు క్రమశ స్తన్నిబోధత॥ (౧-౬౮)

,, చత్వార్యాహుస్సహస్రాణి వర్షాణాంతు కృతంయుగం।
తస్యతావచ్ఛతీ సంధ్యా సంధ్యాంశశ్చతథావిధః॥ (౧-౬౯)

,, ఇతరేషుససం ధ్యేషుససంధ్యాంశేషుచ త్రిషు।
ఏకాపాయేనవర్తంతే సహస్రాణి శతానిచ॥ (౧-౭౦)

శ్లో॥ యదేతత్పరిసంఖ్యాతమాదావే వచతుర్యుగమ్।
ఏతద్ద్వాదశ సాహస్రం దేవానాంయుగముచ్యతే॥ [౧-౭౧]

,, దైవికానాం యుగానాంతు సహస్రం పరిసంఖ్యయా।
బ్రాహ్మమే కమహ ర్జ్ఞేయంతావతీ రాత్రిరేవచ॥ (౧-౭౨)

,, తద్వైయుగసహస్రాంతం బ్రాహ్మంపుణ్యమహర్విదుః।
రాత్రించతావతీ మేవ తేహోరాత్రవిదోజనాః॥ (౧-౭౩)

,, యత్ప్రాగ్ద్వాదశ సహస్రముదితం దైవికంయుగమ్।
తదేకసప్తతిగుణం మన్వంతరమిహోచ్యతే॥" (౧-౭౯)

పూర్వాపర శ్లోకములయొక్క భావమును గ్రహింపకనే 69,70 శ్లోకముల రెంటిని విడదీసి చూచినచో నందువివరింపబడిన సంవత్సరముల సంఖ్య దేవవర్షములైనదియు మానవవర్షములైనదియు స్పష్టీకరింపబడనటుల గన్పట్టునుగాని పూర్వాపరములను గలుపుకొని చదివిన యీ రెండు (69,70) శ్లోకములలో జెప్పబడిన సంవత్సరములు దేవవర్షములని యెంతటి మందమతికిని దోపకమానదు. పూర్వవ్యాఖ్యాతలందరు దేవవర్షములనియే జెప్పియుండిరి. ప్రొఫెసరు బూలరు (Prof. Buhler) పండితుడుకూడను దేవవర్షములని చెప్పియుండెను. (Vide Sacred Books of the East series). ఒకరు జెప్పనేల నా శ్లోకములు వరుసగా కాలవిభాగమును జెప్పుచు మనుష్యుల మాసము పితృదేవతలకొక యహోరాత్రమని 66 శ్లోకమునను, మానవసంవత్సరము దేవతలకొక యహోరాత్రమనియు. నందుత్తరాయణ మారుమాసములు దేవతలకొక పగలును దక్షిణాయనము దేవతలకు రాత్రియుననియు, 67 శ్లోకముచేత చెప్పి, అట్టి దేవతల యహోరాత్రములుగల సం॥రములు నాలుగువేలు కృతయుగమనియు సంధి సంధ్యాంశముల రెండును కలిసి యెనిమిది వందల సం॥రములనియు, తరువాత మూడు యుగములు సంధిసంధ్యాంశలలో కలిసి క్రమముగా 3600, 2400, 1200 సం॥రములని 69, 70 శ్లోకములచేత చెప్పబడియుండగా పూర్వాపరముల నొదలి మధ్య శ్లోకములలోని సంవత్సరముల సంఖ్యనుమాత్రము జెప్పియవి మానుషసంవత్సరములే గాని దేవసంవత్సరములుగావని జెప్పుటలో వారిభావమేమియో లోకులూహించుకొందురుగాక! ఇదిగాక వీరు తమ వాదమున కనుకూలముగా మహాభారత మార్కండేయపర్వమున జెప్పబడిన 188 అధ్యాయము 22-27 వరకు గల శ్లోకములందు జెప్పబడిన నాలుగు యుగముల కాలము 12000 సంవత్సరములని చెప్పబడియుండెననియు, అందు యేసంవత్సరములైనదియు చెప్పబడకపోవుటచే యవి మానవ సం॥రములేననియు చెప్పియుండిరి. వాని కానియనంతరము చెప్పబడిన శ్లోకములలో యట్టి 12000 సంవత్సరము లొక దేవయుగమనియు,

నట్టి వేయిదేవయుగములు గల కాలము బ్రహ్మకొక్క పగలనియు జెప్పబడియున్నది. మహాభారత వ్యాఖ్యానకారుడగు నీలకంఠుడు 12000 వర్షములు దేవవర్షములనియే జెప్పియున్నాడు. మహాభారతము శాంతిపర్వమున కాలపరిమాణములు వివరింపబడియున్నవి. వానినె త్తినయెడల తమ సిద్ధాంతము మూలచ్ఛేదమగునను దలంపుతో వానినె త్తక విడిచియుండిరి. పాశ్చాత్యపండితుల వలెనే ముందు తా మొకనిశ్చయమును చేసుకొని దానిని సమర్థించుటయే పరమావధిగా నెంచి అందుకనువగు భారతీయవాఙ్మయమునందలి వాక్యములను పూర్వాపర సందర్భములనొదిలి వాక్యములో తమ వాదమున కనుకూలించువరకు గల యక్షరములను దీసికొని భారతీయుల చరిత్ర నల్లియుండిరి. వీరివ్రాతలు భారతీయులకు ద్రోహ మొనర్పగల ఘోరమైన యసత్యములని స్పష్టముగా దెలియుచున్నది. నిష్పక్షపాతియైన విమర్శకుడైనచో విషయమును నలువైపులనుండి చర్చించి అనుకూల ప్రతికూల వాక్యములను వివరించి ప్రతికూలమును పరిహరించి యనుకూల వాక్యములను జూపుచు తమ భావములను వెల్లడించిన లోకుల కందుగల సత్యాసత్యములనరసి యేదియో నొకనిశ్చయమును జేసుకొనుట కవకాశము గలుగునుగాని వాక్యములలోని పూర్వాపరముల నొదిలి మధ్యగల మాటలను దీసికొని సిద్ధాంతమును జేయుట లోకమును వంచించుటకేనని వేరుగ జెప్పనక్కర లేదు. గనుక వారు కప్పిపుచ్చిన భారతము శాంతిపర్వములోని దేవమానవ కాలపరిమాణములను గురించి చెప్పబడిన వాక్యములు దిగువ నిచ్చుచుంటిమి చూడుడు.

శ్లో॥ "కాష్ఠానిమేషాదశ పంచచైవ త్రింశత్తు కాష్ఠాగణయేత్కలాంతామ్ ।
త్రింశత్కలాశ్చాపి భవేన్ముహూర్తో భాగః కలాయాదశమశ్చయస్యాత్॥ ౧౨
„ త్రింశన్ముహూర్తంతు భవేదహశ్చరాత్రిశ్చ సంఖ్యామునిభిః ప్రణీతా

మాసఃస్మృతో రాత్ర్యహానీచ త్రింశత్సంవత్సరో ద్వాదశ
మాస ఉక్తః॥
సంవత్సరం ద్వేత్వయనే వదంతి సంఖ్యావిదో దక్షిణముత్తరం
చ॥ ౧౩.

శ్లో॥ అహోరాత్రే విభజతే సూర్యో మానుషదైవికే।
రాత్రిః స్వప్నాయ భూతానాం చేష్టాయై కర్మణామహః॥ ౧౪
,, పిత్ర్యే రాత్ర్యహనీ మాసః ప్రవిభాగస్తయోః పునః।
శుక్లోఽహః కర్మచేష్టాయాం కృష్ణస్స్వప్నాయ శర్వరీ॥ ౧౫
,, దైవే రాత్ర్యహనీ వర్షం ప్రవిభాగస్తయోః పునః।
అహస్తత్రోదగయనం రాత్రిః స్యాద్దక్షిణాయనమ్॥ ౧౬
,, యే తే రాత్ర్యహనీ పూర్వే కీర్తితే దైవమానుషే।
తయోస్సంఖ్యాయ వర్షాగ్రం బ్రహ్మే వక్ష్యామ్యహఃక్షపే॥ ౧౭
,, దివ్యైర్వర్షసహస్రైస్తు కృతత్రేతాది సంజ్ఞికమ్।
చతుర్యుగం ద్వాదశాని స్తద్విభాగం నిబోధ మే॥ ౧౮
,, చత్వార్యాహుస్సహస్రాణి వర్షాణాం తత్ కృతం యుగమ్।
తస్య తావచ్ఛతీ సంధ్యా సంధ్యాంశశ్చ తథావిధః॥ ౧౯
,, ఇతరేషు ససంధ్యేషు సంధ్యాంశేషు తతస్త్రిషు।
ఏకపాదేన హీయంతే సహస్రాణి శతాని చ॥ ౨౦
,, తతః పరం కృతయుగే త్రేతాయాం జ్ఞానముత్తమమ్।
ద్వాపరే యజ్ఞమేవాహుర్దానమేకం కలేయుగే॥ ౨౧
శ్లో॥ ఏతాం ద్వాదశసాహస్రీం యుగాఖ్యాం కవయో విదుః।
సహస్రపరివర్తం తద్బ్రాహ్మం దినముచ్యతే॥ (౨౯)
,, రాత్రిమేతావతీం చైవ తదాదౌ విశ్వమీశ్వరః।
ప్రలయేఽధ్యాత్మమావిశ్య సుప్త్వా సోఽన్తే విబుధ్యతే ॥-30
,, సహస్రయుగపర్యంతమహర్యద్బ్రహ్మణో విదుః।
రాత్రిం యుగసహస్రాంతాం తేఽహోరాత్రవిదో జనాః॥ ౩౧
(శాంతిపర్వం ౨౩౦ అధ్యాయం)

పైభారతము శాంతిపర్వ శ్లోకములలో మానుష, దేవ సం॥

రముల విభాగము స్పష్టముగా చెప్పబడియున్నది. ఇట్టిస్పష్టమైన వాక్యములతో దేవ మానవ కాలవిభాగమును, చతుర్యుగముల కాలప్రమాణములను దేవతల యహోరాత్రములను వానికిని మానవ సం॥రములకును గల గణిత సంబంధమును మనుస్మృతి భారతాది గ్రంథముల గాక సూర్యసిద్ధాంతాది జ్యోతిశ్శాస్త్రములు గూడను చెప్పుచుండ వానిని కాదని తమ యూహల ననుసరించి భారతీయుల గ్రంథములలోని కాలనిర్ణయములను తప్పుగా సమన్వయించుకొని అదే గ్రంథములను ప్రమాణముగా జూపుచుండుట మహాసాహసము. గోపాలయ్యరుగారి యీ విపరీత వాదమునే లోకమాన్య శ్రీయుత బాలగంగాధరతిలక్ మహాశయులుగూడ ననుసరించుట జూడ పాశ్చాత్యవిద్యా వాసనయొక్క మహిమ యెట్టిదో మనకు స్పష్టముగా గోచరించుచున్నది. ఆరువేల సం॥ములకు మించని కాల విధానమున కలవాటుపడిన పాశ్చాత్యపండితులను భారతీయుల సృష్టి కాలపరిమితి విభ్రమమున ముంచివేసెను. వాని నంగీకరించిన తాము చేయదలపెట్టిన సిద్ధాంతములకు ప్రతిబంధకములుగ గన్పట్టుచుండెను. భారతీయుల వాఙ్మయమును పూర్తిగ కాల్పనికమని త్రోసివేయ జాలకుండిరి. అందువలన మతిచెడి తాము చేయదలచిన సిద్ధాంతములకు ప్రతిబంధకములుగ నున్నవిషయములు కొన్ని నూతనసృష్టి యనిరి. కొన్నిటి నతిశయోక్తులని త్రోసివైచిరి. కొన్ని ప్రక్షిప్తములనిరి, కొన్నిటిని లేఖకప్రమాదములని తమ కనుకూలముగా సవరించుకొని యుచ్చాటించిరి, కొందరు భారతీయులు సైతము వారి ననుసరించి నాపాటలనే పాడుచుండిరి. తుదకు వెబరు పండితుడు "రామాయణకథ" కేవలము కాల్పనిక మనెను. వేదములిటీవల వ్రాయబడినవనిరి. పాణిన్యాచార్యునకు పూర్వము భారతీయులకు లిపిజ్ఞానము (వ్రాయుట) లేదనిరి. సంహితలు, బ్రాహ్మణములు, ఉపనిషత్తులు మున్నగునవి క్రమక్రమముగా యిటీవలి కాలమున వ్రాయబడినవనిరి. భారతరామాయణాదులును, పురాణములును నిన్న మొన్నటివనిరి. వారి వాదములు, అందుకు వారు చెప్పెడి

సోపానములను గమనించిన మొదట భారతీయ నాగరికతయొక్క ప్రాచీనతను నిర్మూల మొనర్చి దానికాధునికత్వ మారోపించుటయే వారి యుద్దేశ్యమైనట్టుల స్పష్టముగా మనకు గోచరింపక మానదు. ఈ విషయమునే డా॥ భండార్కారీ విధముగా జెప్పియున్నారు.

"The tendency of most European scholars and antiquarians is to modernise everything Hindu"

తా॥ "హిందువుల సంబంధమగు సర్వమున కాధునికత్వము నాపాదించుటయే యూరపుఖండవాసులగు పండితులలోను, పురాతత్వ విమర్శకులలోను మెక్కువమంది యభిప్రాయమైయున్నది."

ఒప్పిసుతిలాంగు పండితు డీ విధముగా వ్రాసియున్నాడు.

"These foregone conclusions are doing damage to its antiquity. To borrow Chellingworth's language "They dream what they desire and belive their own dreams" "What right has he to express or feel likings" I feel bound to lodge my humble but Emphatic protest on this present occasion"

తా. "కారణము లరయుటకు ముందే నిశ్చయించుకొనబడిన యీ సిద్ధాంతములు వాని (వేదాదులయిన భారతీయ వాఙ్మయము) ప్రాచీనతను నాశనము చేయుచున్నది. వారు కోరిన దానినే స్వప్నమునగాంతురు, వారి స్వప్నములను వారు నమ్ముచుందురు" అని చెల్లింగివర్తు చెప్పినట్టుల వీరిట్లు నిర్ణయించుటకు వీరికేమి యధికారము గలదో? ఇట్టి సిద్ధాంతము లక్రమములు. నీ సందర్భమున సవినయముగ నాయసమ్మతిని తీవ్రముగ బ్రకటించుట నావిధియని తలంచుచున్నాను."

ఈ ప్రకారము పాశ్చాత్యపండితుల యొక్కయు వారి యనుయాయులైన హైందవ పండితులయొక్కయు వ్రాతలు నిరాధారములు. స్వాప్నికదృశ్యములు, ఆకాశహర్మ్యములని యెంచి సత్యాన్వేష

ణమునకు తమ శాస్త్రములను భక్తి శ్రద్ధలతో నధ్యయనము చేయు టయే ప్రతి భారతీయునికి కర్తవ్యమని మనవి చేయుచున్నాము.

పై విచారణవలన తేలిన సారాంశ మేమన :-

(1) తాము ముందే నిశ్చయించిన నిశ్చయములను స్థిరవర చుటకై యుద్దేశింపబడిన పాశ్చాత్య పండితుల వ్రాతలును, వారి యనుయాయులైన హైందవపండితుల వ్రాతలును పరిగ్రహింపతగినవి కావు. సర్వథా యవి త్యజింపతగినవి.

(2) ఎక్కువమంది పాశ్చాత్యపండితులు భారతీయుల ప్రాచీన చరిత్రను నిన్న మొన్నటిదిగా చిత్రించుటయందే ప్రవర్తించిరి.

(3) కృత, త్రేత, ద్వాపర, కలియుగముల సంఖ్య 12,000 దేవవర్షములనియే మనుస్మృతి మహాభారతాది గ్రంథములలో చెప్ప బడినదిగాని మానవ వర్షములని యెచ్చటను చెప్పబడలేదు.

(4) కృతయుగము దేవవర్షములు 4800 × 360=17,28,000 మానవ సంవత్సరములు

| | | |
|---|---|---|
| త్రేతాయుగము | ,, | 3600 × 360=12,96,000 |
| ద్వాపర | ,, | 2400 × 360= 8,64,000 |
| కలియుగము | ,, | 1200 × 360= 4,32,000 |
| పై నాలుగు యుగములు కలిసి | | 12,000 × 360=43,20,000 |

ఒక దేవవర్షము 360 మానవ సంవత్సరములగును.

ఒక దేవదినము 360 మానవ దినములు లేక ఒక మానవ సంIIరమగును.

దేవతల పగలు = మానవుల ఉత్తరాయనము ఆరునెలల కాలము.

దేవతల రాత్రి = ,, దక్షిణాయనము ,,

దేవమాన మొకటున్నదనుటకు వేద ప్రమాణము :-

శ్రుతి:- "పరమేష్ఠీ దేవమానేన సహస్ర సంవత్సరం తపశ్చచార"
(త్రిపాద్విభూతి మహానారాయణోపనిషత్)

తా॥ బ్రహ్మ దేవమానముచే లెక్కింపబడగిన వేయి సం॥రములు అనగా 1000×360=3,60,000 మూడులక్షల అరువదివేల సం॥రములు తపంబొనర్చెను.

పాశ్చాత్య విద్వాంసులు భారతీయ వాఙ్మయ పరిశోధన యందు చూపిన వితర్కముల విధమీదిగువ చూపబడినది.

ఏ=బి (అనగా ఎ. అనునది బి. కి సమానము)
బి=సి— బి ,, సి
సి=డి— సి ,, డి
డి–ఇ— డి ,, ఇ

కాబట్టి ఎ = ఇ అనుసూత్రము ననుసరించి—

(1) రామ=బలరామ (ఇద్దరును విష్ణు అవతారములుగనుక)
బలరామ=హాలభృత్ (రెండును యొకనిపేర్లు గనుక)
హాలభృత్=నాగలి మోయువాడు
నాగలి మోయువాడు= వ్యవసాయము చేయువాడు
(మామూలుగా నాగలిని మోసుకొని పోవునుగనుక)

కాబట్టి:- రామ=వ్యవసాయదారుడు (ఇది పర్యవసానము)
గనుక రామాయణమనగా దక్షిణ హిందూదేశములో వ్యవసాయము చేయుటకు ప్రారంభింపబడిన కథ.

(2) రాముని భార్య = జానకి(జనకుని కుమార్తెగనుక)
జానకి=సీత (ఆమె పేరు)
సీత=నాగలి పద్ధతి ("సీత" అను పదమునకు తెలుగర్థము)
నాగలి పద్ధతి=నాగేటిచాలు

కాబట్టి— రామునిభార్య=నాగేటిచాలు (పర్యవసానము)
గనుక రామాయణమనగా ఆర్యుల వ్యవసాయ విద్యను దెలుపు కల్పిత కథ. (Weber's Sanskrit Literature P. 192)

పాశ్చాత్య ఊహాగానవిధము చూపబడుచున్నది.

(3) (Poet) పొయెటు = కవి

కవి = కబి (By Phonetic Change of V. to. B. వి. బి, గా మారునని సూత్రము.)

కబి = కపి అరవభాషలో వ్రాయబడురీతిని

కపి= కోతి (సంస్కృతకపికి 'కోతి' అని అర్థము)

కాబట్టి :— కవి = కోతి అని పర్యవసానము,

ఈ ప్రకారము విపరీతాభిప్రాయములతోను కుతర్కములతోను పాశ్చాత్య పండితులును వారి అనుయాయులైన హైందవ పండితులును మనగ్రంథములను పరిశోధించి చరిత్రలను వ్రాసియుండిరి. వాటివిలువ యెంతయుండునో విచారింపుడు.

ఇది ప్రథమభాగము

